

శ్రీరంగపట్నం, టిప్పుసుల్తాన్ గుంబజ్.

ఫోటో : ఎస్. బి. పండిట్—మైసూర్.

జూన్ 30-వ తేదీ
విడుదల!



# ఏకాంకికలు

తెలుగు భాషా సమితి వారు 1954 లో జరిపిన పోటీలో బహుమతి పొందిన కుమారి గుడిమెళ్ల బాలా త్రిపురసుందరిగారి ఆరు ఏకాంకికలను పైవారంనుంచి ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికలో ప్రచురింపగలమని తెలుపుటకు ఆనందిస్తున్నాము.

కుమారి బాలా త్రిపురసుందరి గారు ఇదివరలో "గృహ విజ్ఞాన శాస్త్రము" అను గ్రంథమును రచించి తెలుగు భాషా సమితి వారి బహుమతి గెల్చినారు.

—సంపాదకుడు.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : సినీనటి విద్యావతి.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

సంపుటము 48
సంచిక 48
29-6-55

Founder : K. NAGESWARA RAO

మన్మథ ఆషాఢ శుద్ధ దశమి బుధవారం



" ఈ రేడు "

ఫోటో: తంపృలపల్లి సత్యనారాయణమూర్తి—తిరువూర.

# మా మేనమామ

ఒకసారి మా మామయ్యను చూసినవాళ్ళెవరూ ఆయన్ని మరచిపోలేరు. ఆయనలో అంతటి ప్రత్యేకత ఉంది. మా ఊరు ఆ తాలూకాకు ప్రధాన కార్యాలయం. అంచేత ఆ తాలూకాలో ఉన్న పెద్దమనుషులంతా ఎప్పుడో ఒకప్పుడు మా పురవీధులగుండా విహరించి కోర్టును సందర్శించకుండా ఉండలేదు. కాబట్టి వారందర్నీ చూసిన పిమ్మటనే మా మావయ్యలో విశిష్టత లేకపోలేదనే నిర్ణయానికి వచ్చాను.

మా మామయ్య 19 వ శతాబ్దం ఆఖరి పాదంలో పుట్టాడు. ఈ శతాబ్దంలో ఇప్పటికి రెండు పాదాలు దాటించి మూడవ పాదంలోకి అడుగు పెట్టాడు. "ఈ మూడో పాదం ముగిసేవరకూ ఉండక పోనురా అబ్బీ!" అంటూ ఉంటాడు మా మామ. "నాలుగు పాదాలూ చూసి మరీ వెళ్లివచ్చుతే మావయ్యా తొందరేముంది?" అని నేను అంటూ ఉంటాను. ఆ మాటకి మా మామ ఆనందం ఎంత అని వర్ణించను? మిఠాయి అందుకున్న పిల్లవాడిలా సంబరపడతాడు. ప్రాణం అంటే తీపి అంటారు పెద్దలు. ముసలివాళ్లకి చిరంజీవిత్వమే చీనామిఠాయి అని మా మామ ఆనందం చూసినప్పుడల్లా అనుకుంటూ ఉంటాను.

మా మావయ్యను చూసిన వాళ్లెవరూ ఎందుకు మరచిపోలేరంటే ఆయన మిమ్మల్ను 'తొలి చూపు'లోనే వశంచేసుకుంటాడు. మీ కన్ను ఆయన పలుకుతో కాని చెదరదు–లేదా పలువరస ప్రదర్శనతో గాని మరొకచోటికి నడవదు.

దీనికి కారణం ఏమిటంటారా?

ఆయన ఒక యుగం ఆఖరున పుట్టాడు. ఆయనకు ప్రాజ్ఞత వచ్చేసరికి కొత్తయుగం వింత పువ్వులు పూస్తోంది. దాని నాగరికత కొంచెం కొంచెంగా ప్రబలుతూ ఉంది. ఆ నాగరికత స్వల్ప విదేశీస్వభావం కలది కావటంచేత మా మావయ్య దాని ప్రభావానికి లొంగలేదు. పదహారణాల ఆంధ్రుడు లాగ, తెలుగుజాతి ఆకారలక్షణాలకు తిలోదకాలిప్పించే నాగరికతకు తల ఒగ్గకుండా, కళింగరాజ్య పూర్వ ఔన్నత్యానికి కళంకం రాకుండా ఉండాలని మా మావ కంకణం కట్టుకున్నాడు. అందుచేత ఆయన తలకి పాగా రాజులా, ధరిస్తాడు. అది ఆయనకు కిరీటంలాగే ఉంటుంది. ఇంక ఆయన మూతి మీదనున్న నాసికేశాలు ఆ ముఖానికి వన్నె తెస్తుంటాయి. అది పౌరుష చిహ్నం. జాతిబిడ్డ లక్షణం–అని ఆయన నమ్మకం.

మామిడిపండు పంచకి ఎర్రటి రంగుగల దానినే ఎల్లప్పుడూ బిళ్లగోచీతో ధరిస్తాడు. ఆయన పంచ మాసినా రంగు మారదు. రంగులు మార్చకుండా ఉండడమే జాతి లక్షణం అంటాడాయన.

పందలపాకలో తయారైన ముతక గుడ్డను ఒంటిని కప్పుకునేటట్లుగా కుట్టించిన జుబ్బా ధరిస్తాడాయన. దానికి బొత్తాములుగాని, అవి పెట్టుకోడానికి కావలసిన చిల్లులుగాని ఉండవు. ఎందుకంటే ఆ జుబ్బాతో బాటు, దానిపైన ఆయన ధరించే నల్లటికోటుకూడా "బొత్తాం వినా" కుట్టించబడడంవల్ల ఆయన ఛాతీ పూర్తిగా వాయుదేవునికి, దినకరునికి అంకితమై ఉంటుంది. అలా ఉండాలని ఆయన ఆశయం.

**మధుమూర్తి**

ఇంక ఆయనధరించే చెప్పులు మావూళ్లో తెంకడు కుట్టినవే అయిఉండాలి. అవి ఆయనరాకను 'బహుపరాక్' పలుకుతూంటాయి. పొలంగట్లమీద పాముల్ని చెదిరించినట్లు అవి పురవీధుల్లోని పురుషుల్ని చెదిరిస్తూంటాయి.

మా మావయ్యకు నోట్లో చుట్ట ప్రత్యేకాకర్షణ. ఆ చుట్టకి చివర నిప్పంటే లంకపొగాకు ఘుమఘుమలు చుట్టుపక్కలవారికి అందుతాయి. కాని ఆ చుట్టకి చావు ఎక్కువగా నిప్పువల్ల కాదు. నీటివల్లే కలుగుతుంది. అది ఆయననోట్లో నానినాని చస్తుంది.

ఆయన మాట్లాడేది తెలుగుభాష. మరొకలా నాలుక తిరగదు.

ఇటువంటి లక్షణ లక్షితుండైన మా మావయ్య రోజూ తెల్లవారుఝామున నాలుగుంపావుకి లేస్తాడు. ముఖం కడుక్కుంటాడు. పురపాలక సంఘంవారు నాలుగున్నరకి మా ఊరి కుళాయిలకు నీరు పంపుతారు. మా మావయ్య కుళాయిగదిలోనే కూడుని ముఖం కడుక్కుని కుళాయిని విప్పి దానికిందే కూచుంటాడు.

మా ఊరికుళాయిలు నీరు రాబోయేముందు మంత్రాలు చదువుతాయి. ఆరంభంలో చప్పుడుతో గాని చన్నీళ్లురావు. ఆ చప్పుడు వినబడగానే మా మామయ్య "శంభో! శంకరా! మహాదేవ!" అని పంచమస్వరంలో ప్రార్థనశ్లోకాలు ప్రారంభిస్తాడు. మానవరూప శంకరుడికి స్నానమాచరించడం జరుగుతున్నదని మా ఇంట్లోవాళ్లూ, చుట్టుప్రక్కల పదిఇళ్లలో వాళ్ళూ నిద్రలో నేభావించి, కొంచెంగా మేల్కొని, తమ గడియారాలకి టైం దిద్దుకుంటారు.

మా ఊరుసంగతి మీకు తెలియదేమో! ఎండాకాలంలో అతి వేడి, శీతాకాలంలో అతి 'చలి', వర్షాకాలంలో అతివృష్టి: ఈ ఋతులు ఎంత తీవ్రంగా ఉన్నా కాని, శీతోష్ణస్థితిగతులకు లొంగకుండా మా మామయ్య 'నిత్య శీతల జల స్నానాన్ని' కానిస్తాడు. అంచేత ఆ పేటలో తెల్లవారుఝామున ఒళ్లు తెలియని నిద్రలో ఉన్నవారందరికీ మా మామయ్య 'అలారం బెల్'లా ఉపయోగిస్తున్నాడు. అది వారు మా మామకు ఇచ్చిన మర్యాదతో నిండిన అభినందన. కాని నా దృష్టిలో మా మామ ఉచ్ఛస్వరశక్తి గల 'కోడి'! అది ఆయనఎదుట అనే మాట. మరొకటి ఉంది. దానిని మా మామకు వినబడకుండా, అందజేయకుండా ఉండే చోట్ల అటుంటాను: నిశిలో కుక్కుట లక్షణం గల గార్దభం!! నేని అభినందన పత్రాన్ని అందజేస్తే అల్లుడి హాస్యం అని విన్నవాళ్లంతా అంటారు. మీరూ అలాగే అంటారు.

'ఏకపథుడౌ ద్వంద్వకార్యా' అన్నట్లు మా శంకరం మామ స్నానంచేస్తూనే జపం ముగిస్తాడు. దీనికి ఒక కారణం ఉంది. వారి శ్లోకపఠనం మా బావ చెవిని పడగానే లేచి, తన పిల్లల్ని పట్టుకున్నట్లే గదిలో ఆవుకో తట్టి పాలు పిండాలి. మా అత్త లేచి పొయ్యిలోని పిల్లిని లేపి, చీకట్లో పేళ్లను తీసి చేలు తడితే చీకట్లో చీమ కుట్టిందనుకుని నిప్పు వెయ్యాలి. మా మావయ్య జపం అయేటప్పటికి మా బావ పాలు పిండడం పూర్తి అయి, దానిని మా అత్తయ్య కాచటంకూడా పూర్తి కావాలి. వీట్లలో అలస్యం అయితే మావయ్య మనసులో తాళలేడు......మనసు మనసులో ఉండకపోవడమే కారణం. ఆయన మనస్సు స్వల్పంగా స్వస్థానంనుంచి ప్రక్కకు తప్పుకో ప్రయత్నించడానికి ఒక మహా కారణం ఉంది. అది కాఫీ అలవాటు!!

నాగరికతయొక్క వైరితలల లక్షణాలలో ఒకదానిగా కాఫీని చేర్చడు మా మామయ్య. అది ఔషధప్రాయం అంటాడు. ఈ కాఫీ అలవాటుకు ఆయన కొత్తశతాబ్దం

ప్రథమ పాదంలో లొంగిపోక తప్పలేదు. 'టైఫాయిడ్' జ్వరం వచ్చి వెడుతూ వెడుతూ మా మామకు చెంచాతో కాఫీని అందించి "రోజురోజుకూ మోతాదు పెంచు" అని ఆశీర్వదించి వెళ్ళింది. 'శిరసా గృహ్ణామి' అన్నాడు మా శంకరంమామ!

"ఏం మామయ్యా? కాఫీ తెలుగు పానీయం కాదుకదా ఎందుకు సేవిస్తావ్?" అని ఓసారి ప్రశ్నించాను. "సోర్ర్యయ్‌రా అబ్బీ!" అనకుండా నాకు సమాధానం చెప్పాడు. నేనంటే ఆయన కెంతో అభిమానంకదూ! స్వయానా చెల్లెలి కడుపున పుట్టిన చిన్నవాణ్ణి మరి.

"ఏం చెప్పనురా అల్లుడూ? పాత ఆచారాలు, సంప్రదాయాలూ ఉన్నాయ్ చూడూ, అవి మనసునే లొంగదీస్తాయి; దేహాన్ని పట్టుకోవు... ఈ తెల్లవాడి ఆచార వ్యవహారాదులున్నాయ్ చూడూ; అవి మనసుని ముట్టుకోవు, దేహాన్నే పట్టుకుంటాయ్. కాఫీ అనేది పొట్టలో పడవేసే మందు కనుక ఔషధం జాహ్నవీతోయం అని సేవిస్తున్నాను. అదీగాక నా భావనాపటిమవల్ల చెబుతున్నాను విను అబ్బీ— తెల్లవాడి ఇతర సంప్రదాయాలు ఏవీ మనకు వచ్చేవ్ కాని ఒక్క కాఫీని మాత్రం ఆంధ్రులు దత్తత చేసుకోవచ్చురా. దానికి ఆ అర్హత ఉంది" అంటాడు మామయ్య. నేనింకేం అనను?

"అరబ దేశంలో పుట్టి పెరుగుతుంది కాఫీ మామయ్యా" అని అంటే వాళ్లు మనకు సోదరులౌతారనీ, అన్నదమ్ముల బిడ్డకు పెంచుకునే హక్కు ఉందనీ తెలియదుట్రా అంటాడు. మరి ఏ వాదనకైనా లొంగుతాడు కాని కాఫీ వ్యతిరేకవాదన అంటే మాత్రం మామయ్య లొంగడు. కాఫీ అంటే ఆయనకంత అభిమానం. ఆయన పూజాపునస్కారాలు స్నానంతో ముగించి కాఫీ పానం పూర్తిచేసేటప్పటికి ఉషాదేవి ఉదయిస్తుంది.

వెనువెంటనే ఒట్టులు ధరించి, తలపై బుట్టవంటి పాగా పెట్టుకుని మా మామయ్య వీధిలో ఉదయిస్తాడు. అప్పుడే సూర్యుడు మా మామకు గుడ్‌మార్నింగ్ పలుకుతాడు. తొలిసూర్యకిరణాలకాంతిలో మా మామయ్య అడుగులు వేస్తూ ఫర్లాంగులు రెండునడిచి, రెండువీధులుమళ్ళి, పెద్దకూతుర్ను పలుకరించడానికి వెళ్తాడు. ఇది ఆయన దినకృత్యాల్లో మొదటిది. అప్పటికి పెద్దకూతురుమాత్రం తండ్రిమీద గల భక్తితో కాఫీని రెడీచేసి ఉంచుతుంది. అల్లుడు మాత్రం ఇంకా పక్కలోనే దశకు రాడు. పుత్రిక అందిచ్చే కాఫీ పుచ్చుకుని ఆమెను యోగక్షేమాలు అడిగినవెంటనే బయలుదేరి తిన్నగా మా ఇంటికి వస్తాడు. అక్కడికి పది బారల్లోనో, కుపో ఉంటే మరో ఐదు బారల్లోనో ఉంటుంది మా ఇల్లు. ఆయన దైనందిన కార్యక్రమాలలో ద్వితీయస్థానం అందుకున్నది ఈ సందర్శనం. మా అమ్మ అన్నయ్య వస్తాడనే అభిమానంతో తండ్రిపోయిన తరువాత తండ్రంతటివాడు అన్నయ్య అనే గౌరవభావంతో చక్కని, చిక్కని కాఫీ తయారుచేసి హృదయపూర్వకమైన కానుకగా అందిస్తుంది. అరగంటకాలంలో ముచ్చటగా మూడుసార్లు, మూడురకాల గ్లాసులలో మూడురకాల స్థలాల్లో మా మామయ్య కాఫీ సేవిస్తాడు. కాఫీ అంటే ఆయనకు అంత అభిమానం; వల్లమాలిన అపేక్ష. సూర్యుడు సెలవు పుచ్చుకున్నా, వరుణదేవుడు కరుణజూపినా మా మావయ్య మట్టుకు కూతురింటికి, తోబుట్టువింటికీ వచ్చి మూడుసార్లు కాఫీ ముగించుకోకుండా ఉండడు.

ఈ సందర్భంలోనే మా అత్తయ్యగురించి చెప్పడం అవసరం. అత్తయ్య కొంచెం వసపోసినపిట్టవంటిది. మాటకారి అంటే మరి బాగుంటుంది. మాయింటికొచ్చి తన భర్త కాఫీ పుచ్చుకోవడం అంటే ఆమెకు సరిపడదు. కాఫీ అంటే మామయ్యకు మొహం వాచిపోతాడనీ, అంతగా మోతాదు సరిపోకపోతే కన్నకూతురింట త్రాగక మరో ఇంట్లో తాగటం ఏమిటీ అని ఆమె అంటూంటుంది. తోబుట్టువులకీ ఒదినగార్లకీ మధ్య ఆమాత్రంఅభిప్రాయాలుండకపోవడం ప్రకృతివిరుద్ధం; ఆశ్చర్యంకూడా.

"నాయిల్లే వాడికి పరాయిచోటయితే కూతురిల్లూ పరాయికొంపేను" అని మా అమ్మ ఒదినమీద బాణం విసురుతుంది. ఈ బాణాలు ఆడవాళ్లమధ్య ఎంత జోరుగా ఇటూ అటూ పొడుచుకుంటూ పరుగెత్తినా కాని మా మావయ్య ఏమాత్రం చలించడు. రైలుబండి పట్టాలు తప్పనట్లుగానే ఆయన రోజూ ఈ రెండుచోట్లా అదనంగా కాఫీ సేవించక మానడు. కూతురుమీదగాని, చెల్లెలిమీదగాని ఏమైనా ఆయన కోరాలు మిరియాలు నూరవలసివస్తే అవన్నీ కాఫీసేవ అయాకగాని ప్రారంభంకావు.

ఆయనకి ఐదారేళ్లుగా వ్యాపకం ఏమీ లేదు. అంతకుముందు ఆయన చిన్నజమీందారుకి ఛోటా దివాన్‌గా పనిచేశాడు. చిన్నజమీ పరహస్తం కావటంవల్ల మా మామయ్యకి ఆ వ్యాపకం లేదు. మరో ఉద్యోగం చేయడం ఆయనకు అంత అవసరంగా కనుపించలేదు. కొడుకు చేతికి అంది వచ్చాడు. కాస్తో కూస్తో పూర్వులు మిగిల్చి వెళ్ళిన పుణ్యభూములున్నాయి. ఇంకేం లోటు? అంచేత వయస్సు అర్ధశతం కావటంతోనే దివానిగీనుంచి రిటైరయినాడు. ఐతే ఆ తీవి మాత్రం పోలేదు. అందుకనే మామయ్య విశిష్టతగల వ్యక్తి అంటాను.

వ్యాపకం ఏదో ఒకటి లేకుండా ఉంటేగాని జీవి గిలగిలా కొట్టుకుంటుంది. అంచేత మామయ్య ఉదయానే ఈ రొండ్లు ఊరికే కొట్టటం లేదు. ఆయనకు ఎదిగివచ్చిన కూతురుంది. ఆమె పేరు లక్ష్మి. మా ఇంట్లో మా అన్నయ్య ఉన్నాడు. వాడి పేరు కృష్ణమూర్తి. వీళ్లిద్దరికి శుభముహూర్తాన ముళ్లు పడేయడమే ప్రస్తుతం మా మామయ్య వ్యాపకం. మేనరికం చేసుకునే అవకాశం ఉంటే ఆ అవకాశాన్ని జారవిడుచుకుంటే లోకం తనను తిడుతుందని మామయ్య బెంగ. అన్నదగ్గర పిల్ల లేకపోయినా, చెల్లిదగ్గర పిల్లవాడు లేకపోయినా ఆ బెంగ ఉండదు. ఇద్దరిదగ్గరా ఒకే రకం పిల్లలున్నా ఆ బెంగ ఉండదు. సరియైన పిల్లలున్నా వారి వయసులో వ్యత్యాసం కావలసినంత లేకపోయినా ఈ బెంగ ఉండదు. కాని మా అన్ననీ, మా మావకూతురు లక్ష్మిని చూసిన వాళ్లు దంపతులైతే బాగుండునని అడగకపోయినా ఆశీర్వదిస్తారు.

మా మామయ్యకూ ఈ సంబంధం చేసెయ్యాలనే కోరిక ఉంది. అందుచేత ఆయన మా ఇంటికి వచ్చి కాఫీ సేవించి మా అన్న బాగోగులన్నీ చూసి వెడుతూ వెడుతూ మా అమ్మతోనో, అయ్యతోనో 'వీడికి ఈ పరీక్షలయాక ముడి వేసెయ్యాలి సుమా' అంటాడు. మా అమ్మ ఆనందిస్తుంది. మా నాన్న మాత్రం బావగారు రెండు బారలు నడవగా చూసి "మీ అన్న దెంతటి శాక్యం? వాడికి ముడివెయ్యాలనే అంటాడే గాని ఆ పాపిష్టి నోట్లోంచి తన కూతురిని కట్టిపెట్టాలని అనడుకదా!" అంటాడు. ఈ మాటలకి మా అమ్మ మొహం అంతా కోపగిస్తుంది! ఆ రోజుమాత్రం ఇంకా బావాబావమరదుల మధ్య నలుగుతున్న అహంభావాలెంతవరకూ నిజమో కనిపెడదామని మా అమ్మ నిర్ణయించుకున్నట్లుంది.

"అటువంటి దుర్బుద్ధి మా అన్నయ్యకు లేదు" అని అమ్మ ఊరుకుంది.

మా నాన్నలో కోపం పడగెత్తింది.

"మీ అన్నకు స్వంతంగా ఒక బుద్ధి ఉంటే ఇకనేం కావాలి?" అన్నాడు.

నేనూ మా అన్నయ్యా గదిలోంచి వచ్చి చూశాం. పాములు పడగలెత్తాయనీ అవి ఒకదాన్నొకటి కరుచుకోకుండా చూడాలంటే నాగస్వరం పాడాలనీ అనుకున్నాం. కాని, ఏ పాముకి ముందు నాగస్వరం ఊదాలీ అని నేను ఆలోచిస్తూండగానే అన్నయ్య చటుక్కున నాన్నపక్షం పలికాడు.

"పోనేఅమ్మా - మావయ్యమాట నెగ్గుతుందిలే ... అసలైన అల్లయ్య అంగీక

"చిన్న అడుగు, కన్నె అడుగు
చిట్టి అడుగు, పొట్టి అడుగు...
మెట్లుమెట్లు, రాతిమెట్లు
కొరుసల్ల రాతిమెట్లు" (బాపిరాజు)

ఫోటో : పి. సుగుణమూర్తి — మద్రాసు.

#  మా మేనమామ 

ంచాలికాని!" అన్నాడు మా అన్నయ్య.

"మా వదినకీ ఇష్టమే ఈ సంబంధం... మాటలు కట్టిపెట్టు" అంది మా అమ్మ.

"అదిదో ఈవేళే తేల్చేయ్ "శుభస్య శీఘ్రం" అన్నాను నేను.

నా సలహామీద వాదన చాలా పెరిగింది. ఆడపెళ్లివారు మా అమ్మాయిని చేసుకోండని మగపెళ్లివారిని అర్థించడం ఆచారంగాని, తారుమారుగా అర్థించడం అలవాటు కాక పోగా అవమానం అని మా నాన్న పట్టుదల. పరాయిసంబంధం అయితే అటువంటి పట్టింపులుండాలిగాని నాకు స్వయానా అన్నగారిని మీకు స్వయాన పినతండ్రి కూతురైన మా వదినని అడగటంలో అహంభావం ఎందుకుండాలని మాఅమ్మ వాదన.

ఐతే పిల్లికి గంట కట్టే దెవరు? అనే సమస్య తలెత్తినట్టుగానే మా ఇంట్లోవాళ్లకి మా అన్నకు పిల్లనిస్తారా ఇవ్వరా అని మామయ్య ఎదురుగా అత్తయ్యని అడిగే దెవరు అనే చిక్కు ఏర్పడింది.

"నేనున్నాగా!" అని నేననగానే మా నాన్నకి కోపంవచ్చి "పోగొట్టుకునేవాడా పెళ్లి పెద్ద వివిత్రావా?" అన్నారు. నిస్పృహా నా నోటికి తాళం బిగించింది. మా అమ్మకి మాత్రం కంగారు పుట్టింది. ఇదెక్కడ జెసిగి పోతుందనే భయంతో "నేనే వెడతాను. మరో మధ్యవర్తి లెందుకు? తిన్నగా వదిన నే నిలబెట్టి అడుగుతాను" అని చీరకొంగు నడుంకి బిగించుకుంటూ అన్నది. ధైర్యాన్ని లక్ష్మి గుర్తుకొచ్చిందన్నాడు మా అన్నయ్య అమ్మ ముఖభంగిమ చూసి.

మానాన్న ఏమీ అడ్డుపెట్టలేదు. మా

# ద్వితీయము

## కంచి వాసుదేవరావు

### 1

సర్వసామాన్యముగా జరిగే సంగతే అయినా దాని ప్రభావము ఒక్కొక్క మనిషిమీద విశేషముగా వుంటుంది. పెత్తండ్రికొడుకు, శర్మ భార్య పోవడము అసాధారణమయిన విషయము కాదు. అయితేనేం ఆ సంఘటన ప్రభావము శ్రీమన్నారాయణమీద యింతా అంతా కాదు.

శర్మ శ్రీమన్నారాయణకన్న అయిదేళ్లు పెద్ద. తనకి పద్దెనిమిదేళ్లప్పుడు శర్మకి పెళ్ళి అయింది. శర్మభార్య కాపురానికి వచ్చింది. అంతే! అందాకా రాత్రి పదిగంటలుదాకా వూరిమీద షికార్లు కొట్టేశర్మ ఏడుదాటిన తర్వాత యిలు దాటేవాడు కాదు. తన భార్యనుగురించి ఎన్నో విషయాలు చెప్తూ వుండేవాడు. తనూ ఆయింటికి తరచుగా వెళ్తూండేవాడు. ఆ భార్యాభర్తల అన్యోన్యత వారి మధ్య అనురాగాభిమానాలు అతన్ని ఆకర్షించాయి. అప్పుడే రెండో పదిలో అడుగుపెట్టున్న శ్రీమన్నారాయణ తనకి రాబోయే భార్యకూడా తన వదినలాంటి అనుకూలవతే కావాలని కోరుకునేవాడు.

రోజులు గడిచిపోతున్నాయి. శర్మ బిడ్డ తండ్రి అయ్యాడు. అబిడ్డ మూడేళ్ళదయింది. రెండో బిడ్డతండ్రి కాబోతున్నాడు. అతనిజీవితము సుఖముగా గడచిపోతోంది. కాని రెండోకాన్పు కష్టమయి శర్మభార్య సూతికావాతముతో చనిపోయింది. నిజముగా ఎంత హృదయవిదారకమయినదృశ్యమది! శర్మ చంటిపిల్లవాడులా భార్యమీదపడి గుండెలవిసేటు విలపించాడు. అనుకూలవతి అయిన భార్యని పోగొట్టుకోవడముకన్న దురదృష్టమేముంటుంది? శర్మని తనెల్లా వూరడించగలడు? శర్మ మూడేళ్ల కూతురు ఆమెమీద పడి... అమ్మా అమ్మా అని ఏడుస్తూంటే కంట తడిపెట్టనివారు లేరు. 'అమ్మని కట్టి ఎక్కడికి తీసుకువెళ్తున్నారు. అమ్మ యింక రాదా' అని అమాయికముగా ఆ పాప ప్రశ్నిస్తుంటే అందరి హృదయాలు ద్రవించాయి.

శ్రీమన్నారాయణ శర్మని చూసికన్న, ఎక్కువగా ఆ పాపని చూసి జాలిపడ్డాడు. ఏం పాపంచేసిందని పాప కీశిక్ష! నోరారా పిల్చుకునేందుకు అమ్మ కరువయిపోయిందే! యింత పసితనములోనే నిర్మల మాతృవాత్సల్యానికి దూరమయిపోయింది. తల్లిలేని లోటు తీర్చగలిగినవారెవరు? యీ పిల్ల పెద్దదవుతున్నకొద్దీ ఎంత అసంతృప్తితో పెరుగుతుంది? అదిగాక యీ పిల్లని పెంచడము శర్మకో సమస్య...అసలు యీ పిల్లే లేకపోతే...

ఉన్నట్టుండి తనే శర్మ స్థానములో వుంటే తనస్థితి ఎల్లా వుంటుంది అనుకున్నాడు. వద్దు బాబూ యీ దుఃఖము, పగవాడికయినా వద్దు. వద్దంటే తప్పుతుందేమిటి? అలా రాసివుంటే!...రాసివుండడము అనగానే మరో విషయము గుర్తుకు వచ్చింది. అదేమి చిత్రమో కాని తనచెయ్యి ఏ సాముద్రికుడు చూసినా, ఎవరు తన జాతకచక్రము వేసినా ద్వితీయముందనేవారు. ఈనాడు యీ విషయము గుర్తుకు రాగానే అతడు నిలువెల్లా కంపించిపోయాడు. అయితే తనకి భార్యావియోగముందా? తన బిడ్డకి యిదేగతి పడ్తుందా?.... ఏమిటి ఆలు లేదు చూలు లేదు...అప్పుడే భార్యావియోగమంటూ బాధపడ్డానేమిటి అనుకున్నాడు...కాని ఆ భయము వెంటాడుతూనే వుంది......అనుమానము తీరకయింకా చాలమందికి తన చేతిని, జాతకచక్రాన్ని చూపాడు. అందరూ ఒకటేమాట కాకపోతే కొందరు కుండ బద్దలు కొట్టినట్లు చెప్పారు. మరికొందరు సూచించారు. జ్యోతిషాలమీద మూఢనమ్మకాలు లేకపోయినా అందరూ ఆ విషయము తప్పక చెప్పేటప్పటికి భార్యావియోగము తనకి రాసివుందన్న దృఢనమ్మకము నాటుకుపోయింది.

భార్యావియోగాన్ని తను భరించలేడు.

---

అమ్మ ఆక్షణంనుంచి పనులు చేసేవేగాన్ని పెంచి నాన్నని ఆఫీసుకీ మమ్మల్ని స్కూలికి పంపించి అన్నగారింటికి వెళ్లింది. మేం తిరిగి సాయంకాలం గూటికి చేరేటప్పటికి మాఅమ్మ ఇంట్లోనే ఉంది. మా మామయ్య ఇంటికి వియ్యపురాలిలా వెళ్లడం, తిరిగి రావడం అప్పుడే అయిందా అనుకుంటూ నేను వీధి గుమ్మాలు ఎక్కి అమ్మను పిలిచాను. అమ్మ తలుపు తెరిచింది మామయ్యఇంట్లో ఏంజరిగిందో నేను అమ్మను అడగనక్కర్లేక పోయింది.

మా అన్నయ్య ప్రాక్టికల్ క్లాసునుంచి వచ్చేటప్పటికి ఆలస్యం అయింది. నాన్న కూడా తాపీగానే ఇల్లు చేరుకున్నాడు. మా అమ్మ జరిపిన పెళ్లి కబుర్ల ఫలితం అంతా మౌనంగానే గ్రహించాము.

నాన్న కాళ్లు కడుక్కుని తువ్వాలుతో ముఖం తుడుచుకుంటూ వసారాలోకివస్తూ "అన్నమాట నెగ్గిందా?" అన్నాడు. నాన్న ప్రశ్నలో రెండర్థాలున్నాయని, తెలివిగా మాట్లాడాడనీ నాకు సంతోషమైంది.

నాన్నకి చెలగాటంగానూ అమ్మకి అవమానంగానూ వాతావరణం ఏర్పడింది. ఒదినగారి తత్వం, అన్నగారి సత్వం ఎటువంటివో తొలిసారిగా మా అమ్మ కనుక్కోగలిగింది.

"మీ అన్న వీధిలో పెద్దపులి - ఇంట్లో పిల్లికూన అని గ్రహించావా ఇప్పటికైనా" అన్నాడు నాన్న.

"మీకు చెల్లెల్నిచ్చి లోకువైపోయాడు వాడు-ఇక పిల్లనిచ్చి మరీ లోకువ కానక్కర్లేదు...ఇలా కాలం గడిచే చాలెండి" అంది మా అమ్మ. మా అమ్మ అక్కడ జరిగిన కథా చెప్పలేదు, కనీసం కథాసారమైనా చెప్పలేదు. శ్రవణ ఫలితం విని పర్యవసానం మాత్రం మాకు అందజేయడంలో మా అమ్మ చూపిన తెలివి తేటలకి సంతోషించాం.

"రేపు కాఫీకి వస్తాడా మావయ్య?" అని అడిగాడు మా అన్న.

"రాక ఏం చేస్తాడురా! పొద్దున్నే మూడు మోతాదులు పడితేనే గాని శాంతించడు. పెళ్లాం చివాట్లూ, డబ్బు ఖర్చూ తప్పించుకోవద్దూ?" అన్నాడు నాన్న.

మర్నాడు మా మామయ్య కాఫీకి రాకపోలేదు. వచ్చాడు మా యింటికి. గ్లాసు ఖాళీచేసి మా అన్నకేసి చూసి "వీడికి పరీక్షలవగానే ముడి వేసెయ్యాలి సుమీ!" అంటూనే వెళ్ళాడు. మా వాడికి ఒళ్ళు మండింది విసురుగా తువాలు భుజాన వేసుకుని చన్నీళ్ళ స్నానాల గదికి వెడుతూ "మీసాలు మాత్రం ఉన్నాయి బారెడు" అని స్వగతం చెప్పుకుంటున్నాడు.

'ఎంత గొప్పవాడు మామయ్య!' అని ఆ క్షణంలోనే నేను నిర్ణయించుకున్నాను.



 # ద్వితీయము 

అసలు తను పెళ్లి చేసుకోకుండావుంటే... భార్యావియోగమన్న ప్రశ్నే వుండదు. ఏం పెళ్లిచేసుకోకుండా తన జీవితము గడవదా?.... తను ఎరుగున్న బ్రహ్మచారులందరూ గుర్తుకు వచ్చారు.

పెళ్లాముపోయిన ఆరునెలలు తిరగకముందే శర్మ తిరిగి పెళ్లిచేసుకున్నాడు. అంతగా ప్రేమించినభార్య నప్పుడే ఎల్లా మర్చిపోగలిగాడు? అంత తొందరలోనే తిరిగి పెళ్లిచేసుకోవడానికి ఎల్లా మనస్కరించిందో?...వీడికి హృదయమనేది వుందా? ప్రేమంతా ఏమయిపోయింది? అంటూ శ్రీమన్నారాయణ బాధపడ్డాడు ... శర్మ రెండోభార్య కాపురానికిరాగానే ఆ పాప రాతి బయటపడింది. నిజముగా అనిచ బాషాత్తూ సవతితల్లి. రాను రాను శర్మ రెండోభార్యమాటలు విని ఆ పాపమీద చెయ్యి వేసుకునేవాడు. యివన్నీ శ్రీమన్నారాయణ కనిపెడ్తూనే ఉన్నాడు... ఆ పిల్లమీద జాలిపడేవాడు.

రేపు తన పిల్లవానికీ గతి పడ్తుందా!... వద్దు అసలు పెళ్లేవద్దన్న శ్రీమన్నారాయణ నిర్ణయానికి యీ పరిణామాలు దోహదమిచ్చాయి.

కానీ తన కారణము చాలా బలహీనమయినదని, ఎవరూ నమ్మరని తెలుసు. కనుక వివాహముమీద విముఖత్వము కల్గించుకోవడానికి ఎన్ని విధాల వీలుంటుందో అన్నివిధాలా ప్రయత్నించి చాలావరకు సఫలుడయ్యాడు.

శ్రీమన్నారాయణ పెళ్లిచేసుకోనని తల్లిదండ్రులతో ఖండితముగా చెప్పాడు. కారణము ఏం చెపుతాడు? అసలు కారణాన్ని ఎవరూ నమ్మరు. పట్టి పిచ్చివాడిగా జమకడ్తారు. జీవితములో పెళ్లిచేసుకోవల్సిన అవుసరమునుగురించి, అమ్మా నాన్నా, కావల్సివాళ్ళందరూ చెప్పారు. మొదటి భార్యపోయిన ఆర్నెలలకే తిరిగి పెళ్ళికొడుకయిన శర్మ కూడా వివాహ జీవితములో వుండే సౌఖ్యమునుగురించి శ్రమ తీసుకుని వివరించాడు. కాని అందరి మాటలనూ శ్రీమన్నారాయణ తిరస్కరించాడు.

పెళ్లి అనగానే అతనికి శర్మ మొదటి భార్యా వారి అన్యోన్య జీవితము, శర్మ రెండో భార్య చేతులలో ఆ పాప పడ్తున్న అవస్థలు అన్నీ గుర్తుకు వచ్చి నిలువెల్లా కంపించిపోయేవాడు. దాంతో ఆ తలపు అతనిలో పూర్తిగా నశించేది.

అయినవాళ్లు ఎన్ని విధాల వత్తిడి తీసుకురావడానికి వీలుందో, అన్ని విధాలా తెచ్చారు. కాని శ్రీమన్నారాయణ చలించలేదు. అసలు బుద్ధి తెలిసినప్పటినుంచీ, ఆ యింట్లో ఒకడిగా మసలలేకపోయేవాడు. ఎవరికీ ఎవరూ కానట్టు, ఒకచోట వుండవల్సిన విధి ఏర్పడింది కనుక ఒకచోట ఉన్నట్టు ఆ యింట్లోవాళ్లు మసలేవారు శ్రీమన్నారాయణకి విశాఖపట్నములో ఉద్యోగము అవడములో...ఈ వత్తిడినుంచి బయట పడ్డాడనే చెప్పాలి. అతని వ్రతము ముప్ఫయిఏళ్లు వచ్చేవరకు నిర్విఘ్నముగా నే సాగిపోయింది.

## 2

విమల శ్రీమన్నారాయణ ఆఫీసులో క్రొత్తగా టైపిస్టుగా ప్రవేశించింది. ఆమె నాన్నగారు రిటైర్డు పోలీసుపుద్యోగి; అన్నగారు అవూళ్లో బ్యాంకుఏజెంటు. విమలకి జీవితావుసరము కాకపోయినా కేవలము కాలక్షేపార్థము వుద్యోగము చేస్తోంది.

ఒకే ఆఫీసులో పనిచేస్తున్న విమల శ్రీమన్నారాయణలకు వారి అభిరుచులు, అభిప్రాయాలు ఒకటేనని తెలుసుకున్నతర్వాత యిద్దరిమధ్యా పరిచయము ప్రాణస్నేహముగా మారింది.

శ్రీమన్నారాయణ తరచు విమల వాళ్లింటికివెళ్తుండేవాడు. మనసిచ్చి ఆత్మీయులుగా భావించి ఆయింట్లో విమలా ఆమె చెల్లెలు రాజేశ్వరి మాట్లాడేవారు. రాజేశ్వరి కాలేజీలో యింటరు చదువుతోంది.

రోజులు గడచినకొద్దీ విమల తన హృదయాన్ని ఎంతగా ఆక్రమించిందో శ్రీమన్నారాయణ గ్రహించగలిగాడు. విమల స్నేహమేలేకపోతే జీవితానికి ఎంత వెలితో గ్రహించగలిగాడు....కాని చిత్రమేమంటే ఆమెని తన అర్ధాంగిగా ఎన్నడూ వూహించలేదు. అసలు బలముగా ఆ తలపైనా ఎప్పుడూ కలగలేదు. ఛాయామాత్రముగా ఎప్పుడయినాకల్గినా దాన్ని అతను గుర్తించలేదు. గుర్తించినా ఆలోచించడానికి ప్రయత్నించలేదు. వివాహముమీద అతనికి కలిగిన వైముఖ్యమే దానికి కారణము.

ఆనాడు సాయంత్రము శ్రీమన్నారాయణ మామూలుగా వాళ్ళయింటికి వెళ్లాడు. హాలులో విమల నాన్న వెంకటచలముగారు రాజేశ్వరి వున్నారు..."మీరిద్దరే వున్నారు విమలేది" అని అడిగాడు శ్రీమన్నారాయణ..."ఏమో ఎక్కడో ఏకలలు కంటూ కూర్చుందో" అంది రాజేశ్వరి. రెండు నిమిషాలయ్యాక వెంకటచలముగారు వున్నట్టుండి జేబులోంచి డైరీ తీసి, అతనిముందర పెట్టి పెన్ను అందించి, "మీ నాన్నగారి ఎడ్రసు వ్రాయవోయి" అన్నారు. "మా నాన్నగారి ఎడ్రసా. ఎందుకని?" అన్నాడు శ్రీమన్నారాయణ ఆశ్చర్యముగా..."ఎందుకనా!...నీ ప్రవర్తన బాగుండడం లేదని, మా అమ్మాయి పెద్దమ్మాయిచుట్టూ తిరుగుతున్నావని ఫిర్యాదు చేయాలి" అన్నారు సీరియసుగా ముఖము పెట్ట ప్రయత్నిస్తూ!.. కాని ఆయన ఎంత సీరియసుగా ముఖము పెట్టాలన్నా పొంగివస్తుండే వుత్సాహాన్ని అణచుకోలేకపోయాడు. "ఏమని ఫిర్యాదు చేస్తారు?" అన్నాడు శ్రీమన్నారాయణ నవ్వుతూ! "ఏమనా. వెంటనే పెళ్లిచేసేయమని...ఎవరినో కాదు మా విమలనే" అన్నారాయన.

విమలతో తనకి పెళ్లా?...విమల తన జీవితభాగస్వామిని అవుతుందా?......తన జీవితములో అంతకన్న అదృష్ట మేముంటుంది?......కాని చక్కటి సంగీతములో అపస్వరములా తన "ద్వితీయము" గుర్తుకు వచ్చింది. అది తలపుకి రాగానే గడగడ వణకిపోయాడు. వద్దు! తను విమలని పెళ్లి చేసుకోకపోవడమే మంచిది. కళత్ర వియోగము తప్పదని తన నమ్మకము. అందులో, విమలవంటి స్త్రీ వియోగాన్ని తను భరించగలడా!...పోనీ విమల మరెవర్ని చేసుకున్నా తనకి వియోగబాధ తప్పుతుంది. ఆమె అల్పాయుష్కురాలు కావడము తప్పుతుందేమో!

ఈ మాట చెప్పగానే ఎంతో వుత్సాహము చూపుతాడనుకున్న శ్రీమన్నారాయణ ఏం వుత్సాహము చూపించకపోయేటప్పటికి వెంకటచలముగారు, రాజేశ్వరి చాలా ఆశ్చర్యపోయారు. "ఏమిటి నీ అభ్యంతరము" అని వెంకటచలముగారు, మీరు మా అక్కయ్యని ప్రేమించడము లేదా" అని రాజేశ్వరి అడిగారు.

తను విమలని ప్రేమించడము లేదూ?... ఏమిటి అభ్యంతరము? అభ్యంతరము చెపుతే నమ్మతారా!...నమ్మినా, నమ్మకపోయినా తన భయము చెప్పడము విధి... "అభ్యంతరానికి ఏమీ లేదు. విమలనుతప్ప మరో స్త్రీని నేను ప్రేమించడము లేదు......కాని నా చెయ్యి ఏ సాముద్రికుడు చూసినా, చక్రము వేసినా, నాకు ద్వితీయముందని అనేవాడు. అందుకని వివాహముపట్ల నాకు తీవ్ర వైముఖ్య మేర్పడింది. క్షమించండి" అన్నాడు...ఈ మాటలు విని వారిరువురూ నిర్విణ్ణులయ్యారు. తను చెప్పిన కారణము చాలా పేలవముగా వుందని...యిదో కథంటిసాకుగా వాళ్లు తీసుకుంటారని అతనికి అనుమానము కలిగింది. కాని తన భయమునుగురించి నచ్చచెప్పే చాకచక్యము లేదు...వాళ్ల నిరాశా వదనాలను చూడలేకపోయాడు. "వస్తా" అని ఒక అంగలో బయటపడ్డాడు. బయటికివెళ్లి ఎదురుపడ్డదారివెంబట నడిచాడు...తననిమాసి ఏమనుకుంటారు? తక్కినవాళ్లు ఏమనుకున్నా విమల ఏమనుకుంటుంది? తనమీద విమల ఎన్ని ఆశలు పెట్టుకుంది? అన్ని ఆశలూ క్రూరముగా కూల్చేశాడు...రేపు ఆఫీసులో

విమలమొగము ఎల్లా చూడగలడు?...తన గురించి ఏమనుకుంటుంది. "యిదొక వంటి నాకని" అనుకోదూ!...రేపు విమల మొగము తను చూడలేడు..."ప్రేమించి తిరస్కృతి పొందిన స్త్రీ హృదయము ఎంత క్షోభ పట్టుందో" అతని ఊహ కందని విషయము కాదు.

అల్లా ఎంతదూరమువచ్చాడో తెలియదు. కాని తల ఎత్తేటప్పటికి తన మేనేజరుగారి వీధికి వచ్చానని గ్రహించాడు. ఆఫీసుకి వారమురోజులు సెలవుపెట్టి తనవూరికి పోవాలని అవిధముగా విమలముఖము దాటేయివచ్చని అతనికి తట్టింది ... వెళ్ళి మేనేజరుగారిని తనకి అత్యవసరముగా యింటికివెళ్ళేఅవుసరము వచ్చిందని ఓవారము రోజులు సెలవు యిప్పించవల్సినదని అభ్యర్థించాడు అనవసరముగా ఎప్పుడూ సెలవు పెట్టేవాడు కాకపోవడమువలన అతనికి తేలిగానే సెలవు మంజూరయింది.

ఇంటికి వెళ్ళాడన్నమాటేకాని శ్రీమన్నారాయణ అక్కడమటుకు ఏం సుఖపడగలడు?...వాళ్ళమాట తనకి పడదు. తనమాట వాళ్ళకి పడదు. నాన్న తనతో మాట్లాడలేదు. అన్నయ్యముక్త సరిగానే వున్నాడు. ఇంట్లో ప్రతివాళ్లూ తనని పరాయివాడిగానే చూశారు. మనసిచ్చి మాట్లాడేవారు లేరు. అమ్మమటుకు వెర్రిది కనుక వచ్చిన గంట నుంచీ పెళ్లిచేసుకోరా! యింకా ఎన్నాళ్లిల్లా వుంటావురా...అందరూ తలోమాట అంటున్నారురా" అని ఒకటే పోరు మొదలుపెట్టింది. ఆ యింట్లో అసలు వుండలేకపోయాడు. ఆమర్నాడే ఎంత తలవని తలంపుగా వచ్చాడో అంతే తలవని తలంపుగా తిరిగి రైలెక్కాడు.

వూరికి తిరిగివచ్చాడు కాని ఆఫీసుకు కాని, మరెక్కడికి కాని వెళ్ళ బుద్ధిపుట్టలేదు. వూరికి తిరిగివచ్చిన నాలుగో రోజున సాయంత్రము—అప్పుడే చీకటి బాగా వ్యాపించింది. తను గది వెనుకవైపు వసారాలో కూర్చున్నాడు. లైటు వెలిగించాలన్న ధ్యాసే లేదు. యీ నాలుగు రోజులలో విమల యింటికి వెళ్ళాలని చాలా మాట్లు అనుకున్నాడు కాని, తన ప్రవర్తన తనకే చాలసిగ్గు వేసింది. ఏ మొగము పెట్టుకుని వెళ్తాడు! చెప్పనయినా చెప్పకుండా తను వూరువిడచి వెళ్లాడు. మొగము దాటేశాడు అనుకుంటుంది. కాని తనేం చేయగలడు? ఆమె హృదయాన్ని తీవ్రముగా గాయపరిచానని తెలిశాక మొగము ఎల్లా చూపగలడు?

ఇంతలో కుర్చీ క్రింద పడిన చప్పుడయింది. శ్రీమన్నారాయణ గబగబా వచ్చి లైటు వేశాడు. రాజేశ్వరి వచ్చింది. చీకట్లో కుర్చీని తన్నేసింది. కాలి వేలునుంచి రక్తము కొద్దిగా చిందింది. తను లైటువేసి వుంచనందుకు చాల సిగ్గుపడ్డాడు. "ఏం! రాజీ దెబ్బ తగిలిందే... చూడనీ" అన్నాడు నొచ్చుకుంటూ. "పెద్దదెబ్బ తగల్లేదు. రెండునిముషాలలో తగ్గిపోతుంద" అంది రాజేశ్వరి కుర్చీమీద కూర్చుని కాలి వేలునొక్కుకుంటూ." "పిలవలేకపోయావా" అన్నాడు. "మీ ఏకాగ్రతకి భంగము కల్గించ బుద్ధిపుట్టలేదు...వచ్చినదోవనే వెళ్ళిపోదామనుకుంటున్నానుకాని కుర్చీ తగిలింది" అంది రాజేశ్వరి. "వచ్చి వెళ్లిపోవడమా? అంత అపచారమేంచేశాను? ఎల్లావుంది విమల" అన్నాడు శ్రీమన్నారాయణ పరిహాసము చేస్తూ. "విమలమీదవున్న అపేక్ష కన్పిస్తూనే వుంది" అంది రాజేశ్వరి వ్యంగ్యముగా.

"అయితే నేను విమలను ప్రేమించడము లేదంటావా రాజీ!" అన్నాడు శ్రీమన్నారాయణ బాధగా.

"ప్రేమిస్తున్నారా?...అయితే మళ్ళీ మాయింటికి రాలేదేమి? వున్నట్టుండి ఆఫీసుకెందుకు సెలవుపెట్టారు?.. మా అక్కయ్య ఏం అపచారము చేసిందని మీకీ ఆగ్రహము చెప్పండి" అంది రాజేశ్వరి రుద్ధకంఠముతో.

"అపచారము చేసింది విమల కాదు రాజీ!.. నేను..రాజీ! నామాట నమ్మవూ!.. నేను మీ అక్కయ్యనే ప్రేమిస్తున్నాను. కాని; నాకున్న భయమును నువ్వేనా అర్థముచేసుకోలేవూ!"

"మీ బాధని కొంతవరకయినా అర్థము చేసుకున్నానని నా నమ్మకము. అందుకే యివాళ రాగలిగాను. కాని ఒకటి చెప్పండి ...ఎప్పుడో కష్టాలు వస్తాయని యివాళ సుఖపడకపోవడంలో ఏం భావ్యము?

"కాని యీ సుఖాన్ని అనుభవించి, దానికి అలవాటుపడి ఆ సుఖాన్ని కోల్పోతే మన బాధ ద్విగుణీకృతము కాదూ? అసలీ సుఖాన్నే అనుభవించకపోవడము మంచిది కాదూ?

"అందుకని జీవితమంతా వ్యర్థము చేసుకుంటామా?"

"కానీ రాజీ!"

కానీ లేదు. అర్ధణా లేదు...మీరు సున్నితహృదయులని తెలుసు. మీ మనసు తెలుసు. ఈ నాలుగు రోజులలో మా అక్క ఎంత మారిపోయిందో వూహించారా?... మీ యీ ప్రవర్తన ఆమె నెంత ఖేదపరిచిందో గుర్తించారా?

"నన్నేం చేయమంటావు రాజీ!"

"ఒక్క అభ్యర్థనకోసము వచ్చాను!"

"ఏమిటది?"

"మా అక్క ప్రాణదానము చేయమని అర్థించడానికి వచ్చాను."

"ఏమిటే? రాజీ! ప్రాణదానమా" అన్నాడు శ్రీమన్నారాయణ తెల్లబోయి.

"అవును....మీకు స్త్రీ హృదయము తెలియదు. స్త్రీ ఓసారి మనసారా ప్రేమించిందంటే మళ్ళీ మనసు మార్చుకోలేదు. తన ప్రేమ తిరస్కరింపబడిన స్త్రీ హృదయము ఎంత వ్యథపడి ఆమెలో ఎంత సాహసము పుట్టిస్తుందో మీకు తెలియదు. మిమ్మల్ని పెళ్ళి చేసుకుంటే ఎప్పుడో ఆఖరయ్యే జీవితాన్ని యీనాడే నాశనముచేయకండి" అంది అతని రెండు చేతులు పట్టుకుని రాజేశ్వరి.

శ్రీమన్నారాయణ హృదయము ద్రవించింది. ఎన్నాళ్లో అతని హృదయములో కరుడుగట్టుకుపోయిన భయాలు అందులో కొట్టుకుపోయాయి. రాజీ నన్ను మన్నించు! మీ అక్కయ్యని మన్నించమను! యిక ఆలోచించేది లేదు. నేనీ వివాహానికి సమ్మతిస్తున్నా...యిక మీ యిష్టము. తక్కిన బాధ్యతంతా నీదే" అన్నాడు శ్రీమన్నారాయణ.

ఇప్పుడు విమలని శ్రీమన్నారాయణకి యివ్వడానికి వెంకటాచలముగారు, ఆయన భార్య అంత సుముఖత్వము చూపలేదు. శ్రీమన్నారాయణ చెప్పిన కారణము వాళ్ల హృదయాలలో బాగా నాటుకుపోయింది. కాని విమల చాలా పట్టుదలగా వుండడము వలన, యిది అన్ని విధాల నచ్చిన సంబంధము అవడము వలనా ఎవరి కర్మకి ఎవరు కర్తలన్న వేదాంత ధోరణిలో పడి చివరకు యీ సంబంధానికి వప్పుకున్నారు.

వున్నట్టుండి? శ్రీమన్నారాయణ తను పెళ్లిచేసుకోబోతున్నానని వ్రాసిన వుత్తరము చూసి అతని తల్లిదండ్రులు ఆశ్చర్యపోయారు పెళ్లి తమ చేతులమీద జరగలేదని కొంత బాధ కల్గించినా యీ నాటికయినా అతను ఒక యింటివాడైనందుకు వాళ్ళూ సంతోషించారు.

పెళ్లి నిర్విఘ్నముగా జరిగిపోయింది.

## 3

విమలా శ్రీమన్నారాయణల వివాహజీవితము చాల సుఖముగా గడచిపోతోంది. ఒకరి నొకరు అర్థము చేసుకుని సానుభూతిని చూపుకునే వారి జీవితము సుఖముగా గడవక ఏం చేస్తుంది? విమలను తను పెళ్లిచేసుకోకపోతే జీవితము ఎంత నిరుత్సాహముగ గడిచేదో అతను గ్రహించాడు. నిజంగా తను చాలా అదృష్టవంతుడు. కాని నీడలా అతని భయము వెన్నాడుతూనే వుండేది. తన కెన్నాళ్ళీ సౌఖ్యము? ... తన సుఖదినాలు పరిమితమయినవేనా? ముందర బ్రహ్మాండమైన అంధకారాన్ని ఎదుర్కోవాలా? యీతలపులు రాగానే అతనిహృదయము కంపించిపోయేది.

విమల అన్నగారికి వుద్యోగము బదిలీ అయింది. అతనితో ఆమె తల్లిదండ్రులు వెళ్ళిపోయారు. రాజేశ్వరి యింటరు పూర్తి చేసుకుని ఆనర్సులో ప్రవేశించడమువలన

 ద్వితీయము 

విశాఖపట్నములో నేవుండిపోవల్సివచ్చింది.

రాజీని హాస్టలులో చేర్పించాలన్న ప్రతిపాదన వచ్చిందికాని, అక్క యీవూళ్లోనే వుండడము, రాజీ అక్క యింట్లోనే వుండడానికి ఉత్సాహము చూపించడమువలన రాజీ కూడా అక్కదగ్గరే వుంటోంది.

[illegible] యింట్లో రాజీని అందరూ నవ్వుతూ పలకరించి మనసిచ్చి మాట్లాడేవారే! ఆ యింట్లో ప్రతివారికీ ఆమెంటే ఆదరాభిమానాలు [illegible]పేతు...ఆ యింట్లో ఆమె స్వేచ్ఛకి అభీష్టానికి భంగము కల్గించేవారు లేరు.

శ్రీమన్నారాయణ యిప్పుడు బిడ్డతండ్రి. విమలకి పురుడు వచ్చి, తల్లిబిడ్డలకి యిక భర్వాలేదని డాక్టర్లు చెప్పేవరకు శ్రీమన్నారాయణ మనసు మనసులో లేదు. విమల యీ "ప్రమాదమునుంచి బయటండ్డుండా భగవంతుడా" అని అతను ఆందోళన పడిపోయేవాడు. మరి అతనిలో ఒక భయము ఏర్పడిపోయిందయ్యో! ఆ బిడ్డ పెరుగుతున్నకొద్దీ శ్రీమన్నారాయణ విమలల ఆనందానికి అంతులేదు. వాడంటే అందరికీ ప్రేమ. వాడికి వాళ్ల పిన్నిదగ్గరకూడా చాల చనవు. రాజేశ్వరి వాడిని ఎత్తుకుని [illegible]నేక కబుర్లు చెపుతూ వాడితో ఆడుకునేది. వాడికి "మధు" అని రాజేశ్వరి పట్టుపట్టి పేరు పెట్టింది.

పరీక్షలు దగ్గరపడ్తున్నవి...రాజేశ్వరి కిది ఆఖరు సంవత్సరము. యిక నాలుగు నెలలతో ఆమె విద్యార్థి జీవితము పూర్తవుతుంది..రాజేశ్వరి కష్టపడి చదువుతూవుంది. మధుని విడచి వెళ్లడము అంటే రాజేశ్వరికి కొంత బెంగవున్నా అది తప్పేదికాదు...

కాని, ప్రశాంతముగా జరిగిపోతున్న జీవితాలలో పిడుగుపాటు. ఏ కారణముతో శ్రీమన్నారాయణ అన్నాళ్లు పెళ్లిచేసుకోకుండా వున్నాడో...ఏ భయముయితే అతన్ని ఎల్లప్పుడూ వెంటాడేదో చివరికి అదే జరిగింది.

జ్యోతిషాలలో నిజమే వుండనివ్వండి... కాకతాళీయమే కానివ్వండి..విమల హఠాత్తుగా "సెరిబ్రల్ మలేరియా" వచ్చి యిరవైనాలుగు గంటలలో తన తోడిదే జీవితమనుకున్న శ్రీమన్నారాయణని, మూడేళ్ల మధుని విడచి వెళ్లిపోయింది.

## 4

ఆనాడు శ్రీమన్నారాయణ హృదయములో రేగిన పెనుతుఫాను అంచనాలు కట్టగలిగినవారెవరు?...కొంతసేపు భార్యమీదపడి ఏడ్చేవాడు...మరి కొంతసేపు తల బాదుకునేవాడు...యింకొంతసేపు మధుని కౌగలించుకు[illegible]నేవాడు...

ఆ స్థితిలో శ్రీమన్నారాయణ దుఃఖాన్ని కొంతవరకయినా అర్థము చేసుకోగల్గింది రాజేశ్వరి... పోయిన అక్క గురించిన దుఃఖముకన్న...యింత సున్నిత హృదయుడు ఎల్లా జీవితము గడుపుతాడా అన్న జాలి రాజేశ్వరికి కలిగింది.

ఆనాడే కనుక తనే వెళ్లి శ్రీమన్నారాయణని అభ్యర్థించకుండా వుంటే నేడీ విషపరిణామము కలిగివుండేది కాదని, యీ దుస్సంఘటనలో తనకీ పాలువుందని రాజేశ్వరి ఆ క్షణాన బాధపడింది. తెలిసివుండి కూడా విమలని యితనికిచ్చిన ఫలితము అనుభవిస్తున్నామని వెంకటచలముగారు ఆయన భార్య భావించారు. ఆనాడు ప్రతివారూ, శ్రీమన్నారాయణ, రాజేశ్వరి, వెంకటచలంగారూ, ఆయన భార్య, విమల అకాల మరణానికి తమ బాధ్యత కొంత వుందనే బాధపడ్డారు. కాని జరిగిపోయిన దానికి ఆందోళన చెందడము తప్ప ఎవరు ఏం చెయ్యగలరు?

విమల పోయిన పన్నెండవ రోజున వెంకటచలముగారు, శ్రీమన్నారాయణ, రాజేశ్వరి హాలులో కూర్చునివున్నారు.

"రేపు వెళ్ళిపోదామనుకుంటున్నామోయి" అన్నారు వెంకటచలముగారు.

"రేపే వెళ్లిపోవాలా? యింకో రెండు రోజులు వుండకూడదూ" అన్నాడు శ్రీమన్నారాయణ.

"యింకా ఎన్నాళ్ళు వుండమంటావు? ఎన్నాళ్లున్నా పోయినమనిషి తిరిగిరాదుగా" అన్నారు వెంకటచలంగారు.

శ్రీమన్నారాయణ జవాబేం చెప్పలేదు.

"మధు విషయమేమంటావు?" అన్నారు వెంకటచలముగారు.

"అంటే" అన్నాడు శ్రీమన్నారాయణ అర్థముకాక.

"మీ అత్తగారు వాడిని కూడా తీసుకు వెళ్ళిపోదామంటోంది" అన్నారు వెంకటచలముగారు.

ఇంతవరకు శ్రీమన్నారాయణకు ఆ తలపు కలగలేదు. తను ఎంతో గారాబముగా విమల ప్రసాదించిన పవిత్ర చిహ్నముగా మధుని పెంచుకుందామనుకుంటున్నాడు. వాడు కూడా తనకి దూరమవుతే యిక యీ ప్రపంచములో తనకేముంది? "వాడయినా యిక్కడ లేకపోతే బ్రతుకగలనా?" అన్నాడు శ్రీమన్నారాయణ.

"అవుననుకో!...కాని వాడిని ఏ అతదిక్కులేని నువ్వేం పెంచగలవు?...మా యింట్లో మేనమామ కొడుకులతోపాటు పెరుగుతూవుంటాడు...వాడికేలోటూరాని య్యము......కావాలంటే వాడిని అప్పుడప్పుడు తెచ్చుకుని కొన్నాళ్లు అట్టే పెట్టుకుని మళ్ళీ పంపవచ్చు" అన్నారు వెంకటచలముగారు.

వెంకటచలముగారు చెప్పినది నిజమే! తనకి వాడిని ప్రయోజకుడినిగా చేయగల శక్తిసామర్థ్యాలు తుమాత్రి వున్నాయా? ...కాని వాడు తన బిడ్డ...వాడు తనింట్లో పెరగాలి కాని మరో యింట్లో పెరిగే అవుసరమేముంది? ...తన సర్వశక్తులూ కేంద్రీకరిస్తే వాడిని వృద్ధిలోకి తీసుకురాలేడా? "వాడు నా కొడుకు...వాడిని నా సర్వస్వము ధారపోసి పెంచుకుంటా" అన్నాడు శ్రీమన్నారాయణ.

"ఇప్పుడు అలాగే అనిపిస్తుందిలే!... రేపు నువ్వు పెళ్ళిచేసుకున్నాక వాడి రాత బయటపడుతుంది..." అన్నారు వెంకటచలముగారు. తనకి కలలో అయినా లేని తలపుగురించి అప్పుడే విళ్లు ఆలోచించడము శ్రీమన్నారాయణకి ఆశ్చర్యము బాధ కలిగించింది.

"నేను తిరిగి పెళ్ళిచేసుకునేటంత నీచుడిని అనుకుంటున్నారా? ... విమలకి ద్రోహము చేస్తానా?" అన్నాడు శ్రీమన్నారాయణ.

వెంకటచలముగారు ఓ నవ్వు నవ్వేసి... "ఏరోజు కెవరి మనసు ఎల్లా వుంటుందో ఎవరు ఏం చెప్పగలరు? దెప్పిపొడుస్తున్నానని అనుకోకు. ముందర అసలు పెళ్లే చేసుకోనన్నావు. చివరికి విమలని చేసుకున్నావు. యిప్పుడు దాన్ని పెళ్ళిచేసుకోకుండా వుంటే బాగుండేదని నువ్వు మేము అనుకున్నా ఏం లాభము? అల్లాగే...రేపు రెండో పెళ్ళి అయిన తర్వాత మధు గురించి బాధపడ్డము అంతే లాభము" అన్నారు.

శ్రీమన్నారాయణ హృదయానికి కామాటలు శూలాలులా తగిలాయి. కాని ఏం చెయ్యగలడు?..నిజానికి ఆలోచిస్తే ఆయన అల్లా భావించడములో తప్పేముంది? తను మనోవాక్కాయ కర్మలా విమలకి ద్రోహము చేయనని విశ్వసించవచ్చు... తను జీవితపర్యంతము అల్లా వుండగలనన్న విశ్వాసము వుండవచ్చు. కాని వెంకటచలముగారు కాని యింకొకరు కాని ఏ ఆధారముతో యీ విషయాన్ని విశ్వసిస్తారు? పోనీ వాడు అక్కడే పెరిగితే ప్రయోజకుడు అవుతాడు. అమ్మమ్మగారు వాడికీ లోటురానిస్తుంది?...రాజేశ్వరి ఏ లోటు రానిస్తుంది? నిజముగా మధు శ్రేయస్సే తను కోరుతే వాడికోసము తని త్యాగము చెయ్యాలి...తప్పదు!...ఎంత కష్టమయినా తప్పదు..."సరే మీ యిష్టము...యిక నేను చెప్పేదిలేదు. వాడికేలోటు రానివ్వకండి. యిక నేను వుండికూడా లేనివాడికిందే జమ." అని శ్రీమన్నారాయణ ముఖము తిప్పేసుకున్నాడు.

శ్రీమన్నారాయణని ఆ సమయంలో

చూసేటప్పటికి అంతవరకు అక్కడే యీ సంభాషణలలో జోక్యం కల్పించుకోకుండా కూర్చున్న రాజేశ్వరికి కళ్లలో నీళ్లు తిరిగాయి.

"మరి నువ్వేం చేస్తావు రాజీ" అన్నారు వెంకటచలముగారు...యింకో సమస్యని పరిష్కారము చేయాలన్న తలపుతో.

"నేనా?...చేసేందుకేముంది?" అంది రాజేశ్వరి.

"ఈ రెండు నెలలూ హాస్టలులో చేరితే బాగుంటుందని నా వుద్దేశ్యము"

"రాజీ!...నువ్వుకూడా వెళ్ళిపోతావా? అవును. యిక యిక్కడ నీకేమి అవసరము" అని గబుక్కున శ్రీమన్నారాయణ లేచి వెళ్ళిపోయాడు. ఆ మాటల్లోని దైన్యము రాజేశ్వరిని కదిలించివేసింది "రెండు నెలలు భాగ్యానికి మళ్లీ హాస్టలు కెనికి...సీటు దొరకడముకూడా కష్టమే...ఇక్కడే వుంటాను" అంది రాజేశ్వరి.

"అదెల్లా కుదురుతుందమ్మాయి. అక్కయ్య లేని తర్వాత యీ యింట్లో వుండడము బాగుంటుందా మాసేవాళ్ళకి" అన్నారు వెంకటచలముగారు.

"నాన్నగారూ!...యీ యింట్లో అక్కయ్య లేనంతమాత్రాన మన సంబంధ బాంధవ్యాలు, యిన్నాళ్లనుంచి వున్న స్నేహము అన్నీ తుడుచిపెట్టుకు పోయినట్లేనా?..యిక ఆయనకీ మనకీ ఏ సంబంధమూ లేదా!...రేపే మధుని తీసుకు వెళ్లిపోతానంటారు. నన్ను హాస్టలుకి వెళ్ళమ్మంటారు...ఆయనకర్మానికి ఆయన్ని వదిలేసి మనందరము తలోదారి పోవడము భావ్యమేనా!" అంది రాజేశ్వరి.

"అయితే యింతకీ నీ వుద్దేశ్యమేమిటి?"

"నా వుద్దేశ్యము యిది. కాలేజీలు రెండు నెలలలో మూసేస్తారు. యీ రెండు నెలలూ యిక్కడే వుండిపోతాను. నాతోపాటు మధూ వుంటాడు. పరీక్షలయిన మర్నాడు యిద్దరమూ వచ్చేస్తాము. యీలోపున ఆయన దుఃఖము కొంత తగ్గవచ్చు ... అంది రాజేశ్వరి.

బయటినుంచి యీ సంభాషణంతా వింటున్న శ్రీమన్నారాయణ లోపలికివచ్చి వెంకటచలంగారి చేతులు పట్టుకుని...దయవుంచి యీ రెండు నెలలూ రాజీని, మధుని యిక్కడే వుండనివ్వండి యివి చేతులు కావు కాళ్లు అన్నాడు దీనముగా.

వెంకటచలముగారిక మారు మాట్లాడలేకపోయారు. "సరే అల్లాగే కానీ" అన్నారు. ఆనాడు శ్రీమన్నారాయణ రాజేశ్వరితో "రాజీ! యీ నిర్భాగ్యుడిమీద నీకయినా దయవుంది అంతే చాలు" అన్నాడు.

## 5

ఒక్కొక్క రోజు దగ్గర పడుతున్న కొద్దీ శ్రీమన్నారాయణకి భార్యా వియోగ దుఃఖముతో పాటు...ఒక్కక్షణమయినా మధుని విడిచి ఎల్లా వుండగలనా అన్న దిగులు పీడించసాగింది. రాజీ కూడా వెళ్లిపోతే తన బ్రతుకెంత నిస్సారముగా వుంటుందో ... వూహించలేక పోయేవాడు. యిక తనగురించి ఎవరికి కావాలి?...కాని తప్పదు...తన కర్మాని కెవరేం చెయ్యగలరు?...

రాజేశ్వరి శ్రీమన్నారాయణ స్థితి కనిపెట్టూనే వుంది. మధుని విడవడము అంటే ఎంత బాధపడ్తున్నాడో ఆమె చూస్తూనే వుంది. అతను భార్యగురించి తలచుకుని కన్నీరు కార్చని గంటలేదు ... రాత్రుళ్ళు నిద్రపోకు ... వున్నట్టుండి మారు

ఇటీవల కొందరు రచయితలు ఇదివరలో అచ్చయిన తమ రచనలను క్రొత్త రచనలన్నట్లు ఇప్పుడు తిరిగి మాకు పంపడం, కొందరు ఇతరుల రచనలను అన్యభాషలలోనుంచీ, తెలుగులోనుంచీ సంగ్రహించి స్వతంత్ర రచనలుగా పంపడం జరుగుతున్నది. వీరు సోదర రచయితలకు, మాకు జరుగుతున్న అపచారాన్ని గుర్తించడం లేదు. మాకు వచ్చే రచనలను, అనుమానంతో పరిశీలించడం రచయితలకుగాని మాకుగాని గౌరవప్రదం కాదని గుర్తించవలసిందిగా వీరిని ప్రార్థిస్తున్నాము. ఇందువల్ల చిక్కులకు లోనుకావచ్చునని ఇట్టివారు గ్రహించడం మేలు. ఇదివరలో మా పత్రికలోగాని, ఇతర పత్రికలలోగాని ప్రచురించబడిన వేలాది రచనలను చదివి జ్ఞప్తిలో ఉంచుకోడం ఏ సంపాదకునికైనా అసాధ్యమైన పనియని ప్రత్యేకం చెప్పనవసరం లేదు.

అన్యథా సూచించినప్పుడు తప్ప, మాకు వచ్చే రచనలు మొదలైనవి, పంపినవారి స్వతంత్ర రచనలేననే, భావంతోనే మేము ప్రచురించడం జరుగుతుందని అందరూ గుర్తించ ప్రార్థన.

## మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపేవారు ఈ క్రింది అంశాలనుకూడా గమనించ ప్రార్థన.

ప్రచురించని వానిని త్రిప్పిపంపగోరే వారు బుక్ పోస్టుకు అవసరమైన స్టాంపులను, రచనలూ, చిత్రాలూ, ఫొటోలతోనే చేర్చిపంపాలి.

బుక్ పోస్టుకు అణా స్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి.

రచనలను కాయితానికి ఒకే వైపున సిరాతో వ్రాసిపంపాలి.

ఫొటోలు కనీసం కార్డు సైజులో వుండాలి నెగటివ్‌లు స్వీకరించబడవు.

చిత్రాలు ఇండియన్ ఇంకుతో వేసిపంపాలి. రంగుల చిత్రాలు స్వీకరించబడవు.

ప్రచురణ విషయాన్ని వెంటనే తెలియచెయ్యడం కష్టం.

నిరాకరించబడిన రచనలను త్రిప్పి పంపడానికి మాకు కనీసం ఒక మాసమైనా వ్యవధి అవసరం. ఫొటోలు, చిత్రాల విషయంలో యింకా ఎక్కువ వ్యవధి కావలసివుంటుంది.

ప్రచురించే వానిని గురించి ప్రచురించే ముందు మాత్రమే తెలియపరచగలము.

మాకు పంపిన రచనలను, ఫొటోలను, చిత్రాలను గురించి మా కార్యాలయం నుంచి ఎవ్విధమైన సమాచారమూ అందనిదే, వాటి ప్రతులను యితర పత్రికలకు పంపవద్దని ప్రార్థన.

రచయితలూ, చిత్రకారులూ, సహృదయంతో సహకరించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు.

 ద్వితీయము 

మూలలకిపోయో, తలుపులు బిగించుకునో చిన్న పిల్లాడిలా ఏడుస్తాడు... యీ వెర్రి దుఃఖములో ఏ అఘాయిత్యము చేస్తాడో అని రాజేశ్వరి బెంగ. అందుకని అతనికి తెలియకుండానే అతని ప్రతి కదలికా రాజేశ్వరి గమనిస్తూనేవుంది. ఆమె భయానికి ఆధారముకూడా లేకపోలేదు.

ఒకరోజు రాత్రి అతని గదిలో రెండింటికి లైటు వెలుగుతుండడము చూసి ఏం చేస్తున్నాడో చూద్దామని వెళ్ళింది, దగ్గర వేసిన తలుపులు తోసుకుని... బల్లమీద చిన్న సీసాలో తెల్లపొడి వుంది. దాని వంక పరీక్షగా చూస్తున్నాడు శ్రీమన్నారాయణ. "ఏమిటది ఆ సీసాలో" అంది రాజేశ్వరి ... ఝల్లుమన్న హృదయాన్ని దిటవు చేసుకుని... హఠాత్తుగా వచ్చిన రాజేశ్వరిని చూసి అతను తెల్లబోయి...'ఏం లేదంటూ' ఆ సీసా దాచేయబోయాడు. 'ఏం లేకపోవడమేమిటి? ఏం తలపెట్టారు?' అంది రాజేశ్వరి రుద్ధకంఠముతో. "యిదా! నిద్రపట్టడానికి ముందు అంతకన్న ఏం లేదు" అన్నాడు శ్రీమన్నారాయణ ... "కాదు అగమ్యంలో నాకు తెలుసు.... చచ్చి ఏమీ సాధించలేను" అంది రాజేశ్వరి.

శ్రీమన్నారాయణ ఆమె ముఖములోకి చూసి..."రాజీ యీ దుఃఖాన్ని నేను భరించలేను. సాదారి కనురాదు" అన్నాడు ముగము రెండుచేతుల్లో కప్పుకుని. "కాని మధుకి లలితతోపాటు తండ్రినికూడా కరువు చేస్తారా?...ఆ సీసా యిల్లా యిచ్చేయండి?" అంది రాజేశ్వరి. శ్రీమన్నారాయణ మారు మాట్లాడలేక ఆ సీసా యిచ్చేశాడు...

ఇప్పుడు రాజేశ్వరికి రేపు తనూ మధు వెళ్ళిపోతే యీయన ఏ అఘాయిత్యము చేస్తాడో అన్న బెంగ పట్టుకుంది.

శ్రీమన్నారాయణకి మధు ముఖము చూడగానే ఎంతో జాలివేసేది. పాపము యీ పసివాడికి అప్పుడే తల్లి లేదు.

"నాన్నా అమ్మ ఎక్కడలకు వెళ్ళింది" అనేవాడు వాడు ముద్దుగా.

"దేవుడుదగ్గరకు వెళ్ళింది, బాబూ! అనే వాడు శ్రీమన్నారాయణ వాడిని దగ్గరకు తీసుకుంటూ.

"ఎప్పుడొస్తుంది నాన్నా" అనేవాడు.

"యిక రాదు బాబూ."

"నాన్నా నాకు అమ్మ కావాలి?"

ఆ మాటలు ఎంత హృదయక్షోభనుంచి వెలువడ్డాయో శ్రీమన్నారాయణ వూహించేవాడు. కాని తిరిగి మాట్లాడగలడు గొంతులో నీరు గుక్కుకోవడము తప్ప!

"నాన్నా నన్ను అమ్మదగ్గరకు తీసుకెళ్లవూ" అనేవాడు మధు మళ్లీ.

ఇక భరించలేకపోయేవాడు. ఏం జవాబు చెప్పగలడు. "రాజీ వీడ్ని యిక్కడనుంచి తీసుకు వెళ్ళిపో" అని అరిచేవాడు. మధు నాన్నగారి యీ ప్రవర్తన చూసి తెల్లబోయేవాడు వున్నట్టుండి నాన్నగారి కెందుకు కోపము వచ్చిందో అర్థముకాక.

రాజేశ్వరికీ పరీక్షలుదగ్గరపడుతున్నాయి. కాని చదవాలని అనిపించడము లేదు. తను పుస్తకము తెరిస్తే మధుకు ఏం కావల్సి వస్తుందో...బావ ఏం చేస్తున్నాడో అన్న తలపులు వచ్చేవి...కాలేజీకి వెళ్లినా మధు ఏం చేస్తున్నాడో అన్న బెంగే. శ్రీమన్నారాయణ రోజురోజుకి పిచ్చివాడయిపోతున్నాడు. చిక్కి సగమయ్యాడు అప్పుడే! ఏం చేయగలదు తాను? తను కూడా వెళ్ళిపోతే యీయన అన్నము తిన్నదీ లేనిదీ కనుక్కునేవారయినా వుండరు...

రాజేశ్వరికి పరీక్ష లయిపోయాయి. ఆమె విద్యార్థి జీవితము గడచిపోయింది. రెండు రోజులలో యింటికి వెళ్ళిపోతోంది. 'మధు' తన దగ్గర వుండేది రెండురోజులు అంటే నలభైఎనిమిది గంటలు. మధు వెళ్లిపోతున్నాడు...తన గురించి బెంగ పెట్టుకుంటాడేమో!...ఆ బెంగతో ఏదయినా జ్వరము వస్తుందేమో! తర్వాత యిక శ్రీమన్నారాయణ వూహించలేకపోయాడు... వీడు తనగురించి బెంగ పెట్టుకోకుండా వుండాలంటే తనని ద్వేషించాలి. వాడు తనని ఎల్లా ద్వేషిస్తాడు? యింతలో మధు చెయ్యితగిలి కిటికీలో గాజు గ్లాసు పగిలింది. "వెధవా! కళ్ళు కన్పించడము లేదు" అన్నాడు గుడ్లెర్ర చేసి...తన కంఠములో అంత కాఠిన్యము ఎల్లా వచ్చిందో అతనికే ఆశ్చర్యము. వాడు గుడ్లనీరు కుక్కుకుని... నాన్న మొగమువంక చూశాడు. రాజేశ్వరి వచ్చి వాడిని దగ్గరకు తీసుకుని "ఎందుకు తల్లి లేని పిల్లాడిమీద అంత కోపము... చూడండి వాడెంత బిత్తరపోయాడో" అంది. "అది కాదు రాజీ!...యిల్లా విసుక్కుంటే వాడు రేపు మీ వూళ్ళో నా గురించి తలవనయినా తలవడు. బెంగ పెట్టుకోడు, అందుకని..." అని గబగబా బయటికి నడిచాడు.

శ్రీమన్నారాయణ ఎంత బాధతో యీ మాట లన్నాడో రాజేశ్వరికి అర్థము అయింది. తనూ యీపాప లేకపోతే యీ అమాయికుడి బ్రతుకు ఏం కావాలి?...ఆత్మహత్య చేసుకుంటాడో... బైరాగుల్లో కలుస్తాడో...ఆనాడు రాజేశ్వరి తన గదిలో కూర్చుని పోయిన అక్కకోసము బ్రతికి వున్న బావకోసము వెక్కి వెక్కి ఏడ్చింది.

రేపే రాజేశ్వరి వెళ్ళిపోతుంది ... మధు వెళ్ళిపోతాడు. సరిగ్గా యిరవై నాలుగు గంటలు వుంది. ఆరాత్రి శ్రీమన్నారాయణ నిద్రపోలేదు...యిక తన కీలోకములో ఏ ముంటుంది? ఎందుకని తను బ్రతకడము?... లేచి లైటువేశాడు. పన్నెండు అయింది అందరూ నిద్రపోతున్నారు ... ఎదురుగా విమల ఫోటో. ప్రొద్దున లేవగానే రాజేశ్వరి ఆ ఫోటోకి దండ వేస్తుంది. పడుకునే ముందు అగరువత్తులు వెలిగించి అక్కడగుచ్చి పడుకుంటుంది. అగరువత్తులు ఆరిపోబోతున్నాయి. శ్రీమన్నారాయణవెళ్లి ఆ ఫోటో ఎదురుగా నుంచున్నాడు... "యీ నిర్భాగ్యుడ్ని వదలి ఏ లోకాలలో వున్నావు విమలా" అనుకున్నాడు. అతనిలో భావోద్రేకము పెరిగింది. మెల్లిదిగా గది బయటికి వచ్చాడు. పక్కగదిలో రాజేశ్వరి మధు నిద్రపోతున్నారు ...ఆ గది తలుపు కొద్దిగా తెరచిచూశాడు. మధు రాజేశ్వరిని గట్టిగా కౌగిలించుకుని...ఆమె చెంపల మీద చెయ్యివేసి పడుకుని నిద్రపోతున్నాడు. రాజేశ్వరి వాడిని దగ్గరకు తీసుకుని పడుకుంది. ఒక్కసారి యిద్దరివంకా చూశాడు. ఒక్కసారి అతని హృదయములో సంతృప్తి పెరిగింది...రాజేశ్వరి కట్టుకున్న చీర చూసి ముందు విమల అన్న భ్రమ అతనికి కలిగింది. అదే చీరని తను క్రిందటి సంవత్సరాదికి విమలకి కొనిపెట్టాడు. అదే చీర యిప్పుడు రాజేశ్వరి కట్టుకుంది.....రాజేశ్వరికూడా రేపు వెళ్ళిపోతుంది. యీ కొద్దిరోజులలో రాజేశ్వరి తన జీవితములో ఎంత ప్రముఖపాత్ర వహించింది?...రేపు రాజేశ్వరి వెళ్ళిపోతుంది. యిక ఏముంది తనకి ఎదురుగా బ్రహ్మాండమయిన అంధకారము తప్ప.

శ్రీమన్నారాయణ మళ్లీ తలుపు వేసి... వెళ్లి నూతిగట్టున నిద్రగన్నేరుచెట్టు కింద కూర్చున్నాడు. అతనిలో విమలతో పరిచయము మొదలు...యీనాటివరకూ జరిగిన అన్ని సంగతులు గుర్తుకు వస్తున్నాయి. ఆకాశములో ఎక్కడా మబ్బులేని స్వచ్ఛమయిన వెన్నెల....ఆ వెన్నెలలో తనొక స్థాణువులా కూర్చున్నాడు. అల్లా ఎంతసేపు కూర్చున్నాడో తెలియదు. ఎప్పుడు మగతనిద్ర పట్టిందో తెలియదు, కూర్చునే కునికిపాట్లు పడుతున్నాడు......స్వప్నవీధిలో వున్నాడు......అందులో తను, విమలా, మధు......విమల తన వేలతనము చూసి నవ్వుతోంది...వూరడిస్తోంది....

రాజేశ్వరి లేచింది. బావ గదిలో లైటు వెలుగుతోంది ...లేచి ఆ గదిలోకి వెళ్ళి చూసింది. బావ అక్కడ లేడు. ఏమయిపోయాడు యీయన. వరండాలో నుంచుంటే... ఆనూతిగట్టున అంత చలిలో పడుకున్న బావ కన్పించాడు. మూర్తీభవించిన శోకదేవతలా వున్నాడు బావ. నూతిగట్టున బావ...యిక్కడ తను...ఆ

(47-వ పేజీ చూడండి)

సీరియల్

# ఉదయకిరణాలు

పోలుకూచి సాంబశివరావు

## 7

సామాన్యంగా జీవితంలో మానవుని నిర్ణయాలు ఒకవిధంగా ఉంటే, దైవసంకల్పాలుమరోకవిధంగాగోచరిస్తాయి. చేసే ప్రయత్నాలు కొనసాగకపోతూం డడమే మానవుణ్ణి ఒక సామాన్యుడిగా ఉంచే స్తుంది. ఆశించిన కోరికలు, చేసిన ప్రయత్నాలు అన్నీ సఫలీకృతమాతూంటే, మానవుడు ఒక అసాధారణుడై పోతాడు. జీవితమంతా ఆనందమే అయితే, దాన్ని గురించి రసాత్మకంగా చిత్రించే అవకాశం లేదు. రసాత్మకం కాని జీవితం అనుభవపాత్రం కాదు. స్వప్నాలలోవలెనే స్మృతులలో కూడా మనిషి ఆనందిస్తాడు. కష్టాలలో ఉన్నప్పుడు సుఖం, సుఖంలోఉన్నప్పుడు కష్టాలు తల్చుకుంటేనే అనుభవం పరిపూర్ణమై సంతృప్తి కల్గుతుంది. అందుకేలా గుంది ఈ ఆకస్మిక సంఘటనలు మానవ జీవితంలో!

అనేకసిద్ధాంతాలు మనస్సులో స్పృశించుకుంటూ, ఆలోచనల తలదిమ్మతో కోటిపల్లిలో నరసింహంఇంటిముందు చీకటిపడిన వేళకి జట్కాలో దిగాడు అవధాని.

ఇంటివరండాలో జనం కిటకిటలాడుతున్నారు. ఆగిన జట్కావైపు తేరి పార చూశారంతా. పెట్టె బెడ్డింగు జట్కాలో వదిలేసి గుమ్మంమెట్లు గబగబాఎక్కి ఒక్క పరుగులో ఇంట్లో దూకాడు అవధాని. వీధిలో దీపం గుడ్డివెలుగులో జనమంతా అవధానివైపు ఎగా దిగా చూశారు.

నరసింహంమంచంమీద ఆఖరిఘడియల్లో 'అవధాని, అవధాని' అంటూ కలవరిస్తున్నాడు. అవధాని నరసింహంప్రక్కన కూర్చున్నాడు.

'బావా, నేను అవధానిని, వచ్చాను' అవధానిమాటలు తడబడ్డాయి.

నరసింహం మాటలాడ్డం మానేశాడు. గుప్లు అప్పగించి నిదానంగా అవధానివైపు చూశాడు. అవధాని చేతులు తనచేతుల్లోకి తీసుకుని, కళ్ళవెంట నీరు కారుస్తూ, శ్వాస పీల్చడం మానేశాడు హఠాత్తుగా. మాణిక్యం గొల్లుమంది. ఏడుస్తున్న ప్రకాశాన్ని, సాంబుని, రాధమ్మ దుఃఖిస్తూ ఒళ్లోకి తీసుకుంది. నరసింహం పెద్దకూతురు భోరుమంటూ ఏడ్వసాగింది. సీతమ్మ, సోమయాజులు, మాడిపోయిన ముఖాలతో నుంచున్నారు. అవధాని అన్నగారు పరంధామయ్య, కళ్ళజోడు తీసి, అంటుకున్న కన్నీరు తుడుచుకున్నారు. వరండాలో నిండిన జనం గుసగుసలతో సానుభూతివాక్యాలు పలుకుతున్నారు. అవధాని తలవంచుకుని భారంగా శిలాప్రతిమలా నరసింహం శవం ప్రక్కన కూర్చుని పోయాడు.

నాల్గుగంటలసేపు ఇల్లంతా ఏడ్పులతో పెడబొబ్బలతో ప్రతిధ్వనించింది. రాధమ్మ అవధాని దగ్గరకు వచ్చింది.

'ఇంక, ముందు ప్రయత్నంచేస్తే బాగుంటుందేమో.' అన్నది.

అవధాని చేతిగడియారం చూశాడు. పది గంటలయింది. మర్నాడు శవానికి దహన సంస్కారాలు చెయ్యడానికి తీర్మానించారు అంతా.

నరసింహం ఇంటిలోని ఆక్రందనలు దూరాన శోకసముద్రం ఘోషపెట్టినట్లు వినిపించాయి ఆరాత్రి కోటిపల్లి ఊళ్లో.

ప్రొద్దున్న శవాన్ని ఎత్తారు. తండ్రికి దహనక్రియలు చెయ్యవలసి వచ్చింది. అవధాని, పరంధామయ్య, సోమయాజులు, చిట్టిబాబు, శవంవెన్నంటే నడిచారు. ప్రకాశం అగ్నిభాండం చేతులో ఉంచుకుని, మానవ జీవితం చిత్రగతులనుగురించి తల్చుకుంటూ అడుగులు వేశాడు.

మౌనంగా, గంభీరంగా, దీర్ఘాలోచనా తత్పరుడై, తండ్రిశవంకేసి చూస్తూ నడుస్తున్న ప్రకాశాన్ని ఒక్కసారి అవలోకించాడు అవధాని. ఒక ఏడాదికి యీమధ్య ప్రకాశం బాగా ఎదిగాడు. వయస్సులో చిన్నవాడైనా యౌవనం స్ఫుటంగా పొడచూపుతోంది. ఆకారం చూస్తే, అందరూ అతనికి పద్దెనిమిదేండ్లు ఉంటాయనుకో వచ్చు. బాల్యంలోని కష్టాలు ధైర్యంగా ఎదుర్కొనే మానసిక దైహికశక్తులు ప్రకాశానికి దైవం ప్రసాదించాడా అని ఆశ్చర్యపడ్డాడు అవధాని.

శవం శ్మశానం చేరింది. గోదావరి తీరంలో దుబ్బుగడ్డి పెరిగిన ఇసుకనేలలో శవం సవారీ దింపారు. సూర్యుడు రెపరెపలాడుతూ ఆకాశంపైకి ప్రాకిపోతున్నాడు. చితి పేర్చి మంటచేశారు. చెయ్యవలసిన సంస్కారక్రియలు పూర్తయ్యాక, ప్రకాశాన్ని చితికి దూరంగా పోయి కూర్చోమన్నారు. కుర్రాడవడంవల్ల శవం కాలినపుడు, కపాలమోక్షమయినప్పుడు జడుసుకుంటాడేమో అని వారి భయం.

దహనమంటపానికి చుట్టూ బ్రాహ్మణులు, అవధాని, పరంధామయ్య, సోమయాజులు, ఇరుగు పొరుగు స్నేహితులు గుమిగూడి మాట్లాడుకుంటున్నారు. ఆ జనం మధ్యనుంచి అగ్నిదేవుడు పైనున్న స్వర్గానికి నరసింహాన్ని పంపిస్తున్నా నన్నట్లు ఆకాశం అందుకోడానికి ప్రయత్నిస్తున్నాడు.

ప్రకాశం, చిట్టిబాబు గోదావరీ తీరంలో ఒకచోట కూర్చున్నారు. ఒకరితో ఒకరు మాట్లాడుకోలేక మౌనం వహించారు. ప్రకాశం ఒక చేతితో ఇసుక తీసుకుని గుప్పిట్లో పోసుకుని కింద విసురుతున్నాడు. నెలగోజుల క్రితం చకచకా తిరుగుతూ, హాయిగా నవ్వుతూ, సైకిలుమీద ఊళ్లు ప్రయాణం చేస్తూ, తుపాను విసురులా పనిచెయ్యకల్గిన తండ్రి నేడు ఇసుకలో కలిసిపోయాడు. అందరూ ఎప్పుడో ఒకప్పుడు చనిపోతారు. బ్రతికిఉన్న రెండు దినాలు కష్టాలు తలుచుకుని ఖిన్నులవడం, సుఖాలు తలుచుకుని కొండంత పొంగిపోడం దేనికి? జీవితం నీటి బుడగలా ఉద్భవించి మరుక్షణంలో మాయమై పోతుంది. అసలు మనుష్యులు ఎందుకు చనిపోతారు? మరణమంటే ఏమిటి? చనిపోయిన తర్వాత మనుష్యులెక్కడ ఉంటారు? అనంతమైన ప్రకృతి, అంతంలేని ఆకాశం, సూర్యచంద్రులు, నక్షత్రాలు అన్నీ చాలా విచిత్రముగా కనిపించాయి ప్రకాశానికి. అసలు మనిషే బ్రతుకనపుడు, మనిషి జీవితంలో జరిగే ఘట్టాలను గురించి మనిషి బాధపడ్డమెందుకు? అనవసర మనిపించింది ప్రకాశానికి.

శవానికి సంస్కారం చేస్తున్నప్పుడు తండ్రి శరీరం కర్రలా ఉంది. ఒంటిమీద కండలు తడిగా తపతప లాడుతూ నీటిలో తడిసి చనిపోయిన చేపల్లా ఉన్నాయి. కంటి పాపల్లో చలనం లేదు. ఒకసారి కోపం, చిరాకు, మరోకసారి అందం, ఆనందం చూపే ఆ కళ్లు నిశ్చలంగా బొమ్మరాళ్ళలా



ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక నవలారచన పోటీలో బహుమతి పొందిన 'ఉదయకిరణాలు' రచయిత శ్రీ పోతుకూచి సాంబశివరావు, (హైదరాబాదు.)

అడిపోయాయి. చైతన్యంతో పరవళ్ళు త్రొక్కిన తండ్రి శరీరం ముద్దలా మూలపడి ఉంది. మానవుని తుది పరిణామం ఇంతే నన్నమాట!!

ప్రకాశం మెదడులో వైరాగ్యసంబంధమైన ఆలోచనలు అల్లుకుని గూళ్లు కట్టుకున్నాయి. తండ్రిమీద ఉంటే ప్రేమవల్ల వియోగం భరించలేకున్నప్పుడు, ఆవేదన అణచుకోడానికి ఒక వైరాగ్యసూత్రాలే ప్రకాశానికి ఉపశమనం కల్గించకల్గాయి. హృదయంలో బాధ కల్గినపుడు, తండ్రిలాగే తనూఎప్పుడో చనిపోయేదానికి విచారమెందుకనుకున్నాడు ప్రకాశం. ఆకలివేసినప్పుడు ఆహారంకోసం జంతువులు, పక్షులు, ప్రమాదకరమైన అరణ్యంలో తిరగవలసివచ్చినా, ఆపత్సమయాలలో ఆఖరికి తమ గూండ్లలో రక్షణకు పరుగెత్తుకువచ్చినట్లు, తప్పనిసరిగా సుఖదుఃఖాల, మిశ్రమమైన ఈ జీవితంలో కష్టకాలంలో వైరాగ్య గృహంలో రక్షణ తీసుకోడం శ్రేయస్కరమని భావించాడు అతను.

శవం కపాలం బ్రద్దలయి పెద్ద చప్పుడయింది. దహన మంటపాన్ని చుట్టుకుని నిలుచున్న జనంలో కొంత చలనం కలిగింది. తెచ్చిన నిప్పుకుండలు, బ్రద్దలు కొట్టి, దర్భలు, గోదావరిలో కలిపి, స్నానాలు చేసి, నిమ్నవదనులై మౌనంగా అందరూ ఇంటికి చేరారు.

దహనక్రియ పూర్తియిందని విన్న మాణిక్యం గుండె దహించుకుపోయినట్లయింది. శరీరంలోని ప్రతీ రక్తకణం ఒక్కొక్క అగ్నికణంగా మారి శరీరాన్ని కాలుస్తున్నట్లు బాధపడింది. భర్తతోపాటే తనూ చనిపోతే బాగుండేది కాని దైవానికి దయ లేదు. పుట్టిన పిల్లల కోసం, తల్లితండ్రులలో ఒకరినైనా బలవంతాన జీవింపచేసే దేవునికి దయే ఉందో, కాఠిన్యమే ఉందో అర్థం కాలేదామెకు. ఏవో గొడవలు అప్పుడప్పుడు సంసారజీవితంలో వచ్చిపడినా, అపురూపమైన అనురాగంతో తన జీవితంలో నిజమైన ఆనందం చూపించిన భర్త అదృశ్యుడైనాడని తల మొత్తుకుని, గుండెలు బాదుకుని అపరిమితమైన బాధతో విలపించింది మాణిక్యం.

సాంబు, శాంత, తండ్రి చనిపోయినప్పుడు, తల్లి ఏడుస్తున్నప్పుడు, ఏదో బాధ కలిగి ఏడ్చినా, తర్వాత వచ్చినబంధువులను కలుసుకున్న సందడిలో తండ్రిమరణం ఒక విధంగా మర్చిపోగలిగారు. పిల్లల అమాయకత్వాన్ని చూసి పెద్దలంతా జాలిగా నిట్టూర్పులు విడిచి సానుభూతి చూపారు.

సాయంత్రమవగానే సర్వేశ్వరశాస్త్రి, భార్యా, పదిమంది పిల్లలను వెంటబెట్టుకుని, దిగాడు. నరసింహానికి ఈయన స్వయాన సోదరుడు. నరసింహం ఇంకొక రోజులో చనిపోతాడనగా చూద్దామని వచ్చిన సర్వేశ్వరశాస్త్రి తమ్ముడు తప్పకుండా చనిపోతాడని ఎరిగి, నిరాధారమైన అతని కుటుంబ భారం తనమీద పడగలదేమో అని భయపడి 'మళ్లీవస్తా' నంటూ గృహోన్ముఖుడైనాడు.

'మీ తమ్ముడికి ప్రమాదంగా ఉందిగా ఒకటిరెండు రోజులుండకూడదా,' అంది రాధమ్మ.

'మరేం ఫరవాలేదు. వాడి ఆయుర్దాయం ఎనభైసంవత్సరాలుంది. ఎలా చనిపోతాడు? అనుకోడం తప్పుకూడా?' గంభీరంగా ముఖం చిట్లించాడు శాస్త్రి.

జ్యోతిషంమీద నమ్మకమున్న రాధమ్మ నిజమేమో అని నమ్మి మాణిక్యానికి ధైర్యం చెప్పింది.

'అవసరమైతే మళ్లీ వస్తాగా' అంటూ బైటికి దాటుకున్నాడు శాస్త్రి ఆరోజు ప్రొద్దున్న. అవధానికి టెలిగ్రాం ఇవ్వాలనుకుంటోంది రాధమ్మ. అతను తప్పకవస్తాడని ఇంక కుటుంబభారం తనమీదకు వచ్చే పరిస్థితులు తప్పిపోయే యనే ధైర్యంతో, అంత్యక్రియలు పన్నెండు రోజులు సుఖంగా కాలం గడపవచ్చనే ఆశతో, కుటుంబసహితంగా శాస్త్రి వచ్చాడు కోటిపల్లి, తమ్ముడు చనిపోయాడన్న వార్త తెలిశాక.

ఎదురుగా మొదట అవధాని కనిపించాడు.

'అయితే; పోయాడన్నమాట! శివశివా!' అంటూ చెవులు మూసుకుని ధ్యానంతో కాస్సేపు కళ్లుమూసుకుంటూ చతికిలపడ్డాడు శాస్త్రి.

మేకలమందగా శాస్త్రిగారి పిల్లలు, భార్య, ఇంట్లో చొరబడ్డారు.

రాత్రి ఎనిమిది గంటలయ్యేటప్పటికి చుట్టుపక్కల ఉన్న బంధుజనం ఒక వందమంది వచ్చేశారు మాణిక్యాన్ని, అవధానిని పరామర్శ చెయ్యడానికి.

ఒక్కొక్కమనిషి వచ్చి, మాణిక్యాన్ని ఏడ్పించి, పరామర్శచేసి తమ విధ్యుక్తధర్మం నెరవేరిందనే సంతృప్తితో పన్నెండుదినాలూ ఇక్కడే ఉండి భోంచేసి నరసింహం ఆత్మకు శాంతి చేకూర్చాలని ప్రార్థిస్తూ ఆ యింట్లో తిష్టవేశారు. ఇదిచూసి అవధాని బంధువుల వింత ప్రవర్తనలు ఇలాగే వుంటాయనుకుంటూ లోలోపల విమర్శించుకున్నాడు.

బంధువులంతా ఆ రాత్రి సుష్టుగా భోంచేసి, నిద్రాభారంతో కాళ్లు సాచుకుని దొరికినమూల పక్కలు పరుచుకుని హాయిగా గుఱ్ఱులుపెట్టి పడుకున్నారు.

ఒక్కర్తె బిందెలతో అన్నం వార్చి, బంధువుల భోజనాలు పూర్తి చేయించి వంటింట్లోంచి బయటపడి రాధమ్మ మాణిక్యంప్రక్కకు చేరింది విచారంతో. గాలిలోని పక్షిలా ఆధారంలేక అల్లాడుతున్న ఈకుటుంబంగురించి ముందుకర్తవ్యం ఆలోచిస్తూ వీధిలో పచార్లుచేసి అవధాని మాణిక్యందగ్గరకు వచ్చాడు. భర్త మరణంవల్ల ఆవేదనతో మాణిక్యం కుములుతూంటుందని ఆమెను ఓదార్చవలసిన బాధ్యత తమకుందని గుర్తించుకున్నారు అవధాని, రాధమ్మ.

పదకొండుగంటలు కొట్టింది గడియారం. బయటిచీకట్లో వీధిలాంతర్లు మినుకుమినుకుమంటున్నాయి. చుట్టూ ప్రశాంత వాతావరణం.

ఓదార్చడానికి దగ్గరకు వచ్చిన అవధాని రాధమ్మలను చూసి మాణిక్యం వెక్కివెక్కి ఏడ్చింది.

'ఊరుకోవే తల్లీ! ఏడుస్తే ఏం ప్రయోజనం!' రాధమ్మకూడా కన్నీరు పెట్టుకుంది.

"మాణిక్యం! ఊరుకో!" అనతి, అనునయం, అభిమానం, ఆవేదన, తొణికిసలాడాయి అవధానిమాటల్లో.

మాణిక్యం ఏడుపు తగ్గించుకుంది.

"విధివ్రాత కాకపోతే హఠాత్తుగా ప్రయాణం చెయ్యడమేమిటి? ఆపరేషను జరగడమేమిటి? చనిపోడమేమిటి? అంతా చాలా

...త్రంగా ఉందో" నిట్టూర్పు విడిచాడు అవధాని.

"అవతలవాడు చేయించుకోదలచుకున్నాడా? మాకు ఉత్తరం వ్రాస్తే కాకినాడలో ఉంచి దాక్టరు ఎవరిచేతనైనా చేయించమా? అతనికి ప్రాణంమీదకు వచ్చేదాక మాకు చెప్పనేలేదు" రాధమ్మ తాను చేయగలిగే సహాయానికి అవకాశం మిగల్చలేదని బాధపడింది.

'నేను చెప్పాను. వినలేదు.' భర్త చేసినది తప్పని ఒప్పుకుంది మాణిక్యం.

"ఇంతకీ వ్రణం ఎలా బయలుదేరిందో! దానికి ఏదో కారణం!!' అవధాని గోడకి జార్లపడ్డాడు.

"చేసిచేసి వచ్చిందట! ఈ ఉద్యోగంలో చేరినప్పటినుంచి రోజూ ఏదో ఊరు తనిఖీకి సైకిలుమీద వెళ్ళి వచ్చేవాడుట! రోజుకు ముప్పయి మైళ్ళు సైకిలు ప్రయాణంచేసి, సరైన తిండి తినకపోతే ఏమౌతుంది? జీతంలో వీలైనంత కూడబెడుతూ తిండి సరిగా తినడం మానేశాడుట! ఆస్తి అంతా తగలబెట్టేశానని పశ్చాత్తాపపడి, పిల్లలమీద మమకారంతో ప్రతి పైసా దాచి పేగులు మాడ్చుకుంటే ఏమౌతుంది?... ఆఖరి రోజుల్లో పిల్లలను ఒక్క క్షణంకూడా వదిలేవాడు కాదుట!!" కంట తడిపెట్టుకుంది రాధమ్మ.

"టెలిగ్రాం అందగానే పంచప్రాణాలు ఎగిరిపోయినట్లయింది నాకు. దైవం యిలా నిర్ణయిస్తే మరోలా ఎట్లా జరుగుతుంది?" అవధానికి కూడా దుఃఖంవచ్చి చేతులతో ముఖం కప్పుకున్నాడు.

"ఇంక విచారించి లాభంలేదు. మాణిక్యాన్ని, పిల్లలని, ముందు ఎలా పోషించాలో ఆలోచించాలి." రాధమ్మ సూచించింది.

"పెద్దలంతా వున్నారుగా. వాళ్ళ నడుగుదాం" అవధానిమాట కటువుగా వచ్చింది.

తన నిశ్చయాలు కార్యరూపంలో పెట్టడమే కాని, వాటికి కనిపోని ప్రచారం ముందు ఇవ్వడం, అవధానికి యిష్టంలేదు. ఎవరైనా బంధువులు, స్నేహితులు, కష్టాలలో వున్నట్లు అతనికి తెలిస్తే, తోచిన ఆర్థిక సహాయం చెయ్యడం అవధాని అలవాటు. స్వార్జితంగా లభించిన ధనం మీద వారు ఆశ్చర్యపడి, అవధానిని పొగడటం కూడా కద్దు. ఇంట్లోనే వున్న నరసింహం అన్నగారు, శాస్త్రి, తన అన్న పరంధామయ్య ఏం సలహా లిస్తారో మాత్రం చూడాలనుకున్నాడు.

అవధాని నరసింహానికి వ్రాసిన ఉత్తరం రాధమ్మ చేతిలో పడింది. తిరిగి చెల్లిచేసు కోవాలని అవధాని అనుకుంటున్నందుకు సంతోషించింది. అటువంటప్పుడు మాణిక్యం కుటుంబాన్ని పూర్తిగా పోషించడం అవధానికి చాలా కష్టమౌతుంది. అంతగా అవసరమైతే, తనుకూడా ప్రకాశానికి రెక్కలు వచ్చేదాకా తప్పకుండా ఉన్న దాంట్లోనే చెల్లెలికి సహాయం చెయ్యాలని రాధమ్మ నిశ్చయించుకుంది. పరిస్థితులు ఎలా పరిణమిస్తాయో జాగ్రత్తగా ఆలోచించి తన నిశ్చయం చెప్పవచ్చుననుకుంది రాధమ్మ.

అవధాని మాటల్లోని అంతరార్థం తెలుసుకోలేక మాణిక్యానికి గుండె జారిపోయినట్లయింది. ఇంతవరకూ అవధాని ఆదుకోగలడని మాణిక్యం అల్లుకున్న ఆశలు తెగిపోయాయి.

రాధమ్మకూడా మౌనం వహించడం మాణిక్యానికి మరీ దుఃఖం కలిగించింది.

ఒక పదిహేను నిమిషాలు ముగ్గురూ మౌనంగా ఒకరివైపు ఒకరు చూస్తూ కూర్చున్నారు.

'పడుకోండి' అంటూ అవధాని కుర్చీలోంచి లేచాడు. బంధుత్వంకన్న, నరసింహంతో అవధానికి స్నేహం హెచ్చు. అసలు నరసింహం అంటే అతనికి అపరిమితమైన అభిమానం. నరసింహం చనిపోవడంవల్ల తన పంచప్రాణాలు హరించాయని, బాధపడుతూ, చైతన్యంలేని జడుడులా తన గదిలోకి వెళ్ళి పడుకున్నాడు అవధాని.

నరసింహం చనిపోయి 12 రోజులు గడిచాయి. అంత్యక్రియలకు బంధువుల భోజనాదికాలకు అయిన అయిదువందల రూపాయల ఖర్చు అవధాని భరించాడు. పరంధామయ్య ఆప్తుల్లో తను ఎరుగున్న ఆఫీసర్లను అందరినీ కలుసుకుంటూ, కబుర్లు చెబుతూ కాలక్షేపం చేశాడు. సర్వేశ్వర శాస్త్రి ఎరుగున్న వారి ఎదుట మొసలి కన్నీరు కారుస్తూ, తమ్ముడు చనిపోయినందుకు, నిరాధారంగా కుటుంబాన్ని వదలినందుకు ఎంతో బాధ, సానుభూతి వ్యక్తంచేస్తూ, ప్రతి నిమిషం శివుణ్ణి ధ్యానించుకోసాగాడు. అడంగి

సంతోషంలో తమతమ పిల్లలకు భోజనాలు పెట్టుకోడం, పుస్తకాలు కొనడం, తీరుబడి కల్గినప్పుడు నరసింహం చేసిన మంచి పనుల గురించి పొగడ్డం—అనేక విధాల ఎవరికి తోచిన రీతిలో వారు కాలం గడిపారు.

పన్నెండవరోజు అందరూ భోజనాలు యథావిధిగా పూర్తిచేసి, ప్రయాణసన్నాహాలలో నిమగ్నులైనారు. పిల్లలనందరినీ ప్రయాణానికి సిద్ధపరచమని భార్యను హెచ్చరిక చేశాడు సర్వేశ్వరశాస్త్రి. పరంధామయ్య తన ఖరీదైనబట్టలు పెట్టి, సామానులు జాగ్రత్తగా- అన్నీ ఉన్నాయో లేదో తనిఖీ చేసుకుంటున్నాడు. సోమయాజులును తక్షణం కాకినాడ వెళ్ళిపొమ్మని సీతమ్మ పోరు పెడుతోంది. ఎవ్వరికీ కూడా మాణిక్యం కుటుంబం ముందుగతిగురించి ఆలోచన అవసరం లేనట్లు మసలజొచ్చారు.

ఇదంతా పరికిస్తున్న అవధానికి ఒళ్ళు మండిపోయింది. సర్వేశ్వరశాస్త్రిని, పరంధామయ్యను, సోమయాజులుని, రాధమ్మను పిలిచాడు మాట్లాడాలని. త్రేనుస్తూ బొందెం సరిచేసుకుంటూ శాస్త్రిగారు, వేసుకున్న విస్త్రీమడత నలిగిపోకుండా సర్దుకుంటూ పరంధామయ్య, కళ్లజోడులోంచి కిందకు చూస్తూ నవ్వుతూ సోమయాజులు అవధాని దగ్గరకు వచ్చారు. పైకి గంభీరంగా ఉన్నా, ప్రతీవాడూ లోపల కొంచెం తికమక పడుతూ నేవున్నాడు, సంభాషించే విషయం ఇట్టే గ్రహించుకుని.

'మరి మాణిక్యం సంగతి ఏం చేద్దాం? ఎవరిగూటుకు వాళ్ళు వెళ్లిపోవాలని ప్రయాణాలు కడుతున్నారాయిరి !!' సమాధానం కోసం అందరి ముఖాలవైపు చూశాడు అవధాని.

'ఉన్న రెండురోజులు కళ్లుమూసుకుని ఆస్తి అంతా తగలబెట్టాడు. చేసినపనికి అనుభవించవలసిందే కుటుంబం' చిరాకు పడ్డాడు పరంధామయ్య.

'శివశివా! ఎంత గతి వచ్చిందిరా దేవుడా!' శాస్త్రి తిరిగి ధ్యానంలో పడ్డాడు.

సోమయాజులు నవ్వుతూ మౌనంగా చూస్తున్నాడు.

'జరిగిన సంగతులు త్రవ్వకోడం కాదు. ఇప్పుడు ఏం చేద్దాం అన్న సంగతి ఆలోచించాలి' అవధాని అన్నగారివైపు చూశాడు.

'నేనుమాత్రం ఏమీ సహాయం చెయ్యలేను. నా కుటుంబం పోషించుకునేటప్పటికే చాలా కష్టమౌతోంది. పైగా ఇన్నారెన్నులు, కొన్న ఇంటికి బాగు ఖర్చులు, కుర్రాళ్ళకు చదువులు - యివన్నీ నా జీతం పూర్తిగా మింగేస్తున్నాయి' పరంధామయ్య ఏమాత్రం జాలి చూపించదల్చుకోలేదు. ఏమైనా సానుభూతి ప్రకటిస్తే, నరసింహం పిల్లలలో ఎవర్నైనా ఒకర్ని పోషించే భారం తీసుకోమంటారనే భయంతో.

"సరే! అయితే నువ్వు నీ యింటికి ప్రయాణం కావచ్చు" కటువుగా అనేశాడు అవధాని.

'నాకు మొత్తం చెప్పక్కర్లేదు' అనుకుంటూ గొణుక్కుంటూ లాడుతూ వెళ్లిపోయాడు పరంధామయ్య.

పరంధామయ్య తహసీల్దారు ఉద్యోగం చేస్తున్నాడు. తండ్రి తాతలవల్ల ఆస్తి ఏమీ సంక్రమించకపోయినా, తెలివి, పొదుపు ఉపయోగించి, బాగా ధనం సేక

## ★ ఉదయకిరణాలు ★

తించి, ఒకయిల్లు, పదికరాల మాగాణి భూమి కొనుక్కుని హాయిగా జీవిస్తున్న వాడే. కాని ఎప్పుడూ తన భార్యాబిడ్డల శ్రేయస్సు ఒక్కటే ఆలోచించడంవల్ల, తక్కినవాళ్లు ఏమాతున్నా అసలు ఆలోచించే మనిషి కాదు. అవధానికి, పరంధామయ్యకు, చిన్నప్పటినుంచీ చుక్కెదురు. మంచి మర్యాదలలోను, గుణగణాలలోనూ, అవధానిని ప్రశంసించినంతగా ఎవరూ పరంధామయ్యను పొగడరు. కారణం పరంధామయ్య స్వార్థపరత్వమే.

సర్వేశ్వరశాస్త్రి కొంగజపం పూర్తి చేశాడు.

'అబ్బాయీ! చూశావుగా నా సంతానాన్ని! ఇంతమందిని పోషించడం అంటే మాటలా! వీళ్లకు పెళ్లిళ్లు, చదువు సంధ్యలు చెప్పించడం మామూలు విషయం కాదు. యీ సంతానం యివ్వడంలో దేవుడు కొంత పరిమితి చూపి ఉంటే, మాణిక్యం కుటుంబాన్ని కొంత ఆదుకో గలిగేవాణ్ణి! కాని వీళ్ళను ఆదుకోడానికి మరి నా పిల్లలను చంపెయ్యడం భావ్యం కాదుగా!!... హరి హరీ! హరి!' అంటూ తిరిగి ధ్యానంలో పడ్డాడు శాస్త్రి!

అవధానికి ఒళ్లు మండిపోయింది. 'మీరేమైనా సహాయం చెయ్యగలరా అని అడుగుతే, నా పిల్లలను చంపెయ్యమంటారా?' అనే శాస్త్రి కుళ్లుమాటలు అవధానికి అసహ్యం కల్గించాయి.

నరసింహంతో బాటు శాస్త్రికి కూడా మంచి ఆస్తే దక్కింది. ఆయన చెప్పే హరికథలు పురాణాల వల్ల, వడ్డీ వ్యాపారం వల్ల ఉన్న ఆస్తి పెంచి, భార్యకు పిల్లలకు ఒంటినిండా బంగారు నగలు, తనకు బంగారు చేతికడియాలు, కుండలాలు చేయించుకుని చీకు చింతా లేకుండా హాయిగా జీవితం గడుపుతున్నాడు. అటువంటి వాడుకూడా తమ్ముడి పిల్లలమీద ఏమీ దయచూపించకపోడం మానవత్వం లేకుండా ప్రవర్తించడమని బాధపడ్డాడు అవధాని. చటుక్కున అతని మెదడులో ఒక విషయం జ్ఞప్తికి వచ్చింది.

'ఆ మధ్య మీ భార్య నగలు తాకట్టు నుంచి విడిపించడానికి నరసింహం తన దగ్గర ఉన్న అయిదు వందలు మీకు అప్పు యిచ్చానని నాతో చెప్పాడు. అదైనా యివ్వండి. పిల్లలకు ఆధారంగా

ఉంటుంది!' అవధాని శాస్త్రి ముఖంలోకి సూటిగా చూశాడు.

శాస్త్రిముఖం మాడిపోయింది. తత్క్షణం జాగ్రత్తగా ముఖ కళవళికలు మార్చు కున్నాడు.

'శివశివా! మీతో చెప్పలేదా! ఏనాడో తిరిగి యిచ్చేశానే సొమ్మూ' శాస్త్రి కళ్లు పెద్దవిచేసి ఆశ్చర్యంగా పెట్టాడు ముఖం.

ఒకరోజు కోటిపల్లిమీదుగా ప్రయాణం చేస్తూ, శాస్త్రి భోజనానికి తమ్ముడి ఇంట్లో విడిదిచేశాడు. ఆరోజే బ్యాంకునుంచి ఒక వెయ్యి అప్పు తీసుకుని, పేకాట ఆడి; కొంచెం లాభంపొంది, ఖులాసాగా ఇంటికి వచ్చిన తమ్ముడిదగ్గర పైకం జేబులో ఘల్లు మనడం మాసి శాస్త్రికి కళ్లు కుట్టాయి. అసలు ఎవరిదగ్గరైనా డబ్బు కనిపిస్తే శాస్త్రికి కళ్లు పచ్చబడడం అలవాటు. తమ్ముడి వ్యసనాలు గ్రహించిన శాస్త్రి అతని మంచితనం గురించి పొగిడి తన భార్యనగలు తాకట్టు నుంచి విడిపించుకోడానికి ఒక ఐదువందలు అప్పు యిమ్మని తీసుకున్నాడు. ఇంక తమ్ముడు చనిపోయాడుకదా అని దర్జాగా బొంకేశాడు శాస్త్రి.

అన్నగారికి అప్పు యిచ్చినట్లు నరసింహం విజయనగరం వచ్చినప్పుడు అవధానికి చెప్పాడు. వాలకం చూడగానే శాస్త్రి బొంకుతున్నాడని తెలిసినా, బుజావులేక అవధాని కోపంతో నోరు సంభాళించుకోవలసి వచ్చింది.

'దొంగ పీనుగులు!' పళ్లు కొరుక్కుని లోపలే సణుగుకున్నాడు అవధాని.

'శివ శివా! హరి హరి! ఎంత కష్టం వచ్చిందిరా దేవుడా!' అంటూ లేచాడు శాస్త్రి ఇంటికి ప్రయాణం కట్టడానికి.

మౌనంగా కూర్చున్న సోమయాజులు తరఫున మాట్లాడే బాధ్యత సీతమ్మ తనపైన పెట్టుకుంది.

'మాసంగతి మీకు తెలియందేముందిరా! పిట్టను కొట్ట పొయ్యిలో పెట్టు!' ఒక్క మాటలో తేల్చేసింది సీతమ్మ, తాము చెయ్యబోయే సహాయం గురించి.

"మీ రెవ్వరూ వాళ్ల గొడవ పట్టించుకో నక్కర్లేదు! అంతా నే మాసుకుంటా లెండి" కళ్లలో నిప్పులు కురిపిస్తూ లేచాడు అవధాని.

'నన్నేం చెయ్యమన్నా నే చేస్తారా అవధాని! నాకుమాత్రం ఎవరున్నారు ఒక్క కొడుకు తప్ప! మాణిక్యం పిల్లల్ని నా పిల్లలాగే చూసుకుంటాను' రాధమ్మ తన నిశ్చయం వెల్లబుచ్చింది.

రాధమ్మ మాటలు విన్నా, చిరాకులో విననట్లు తన గదిలోకి వెళ్ళిపోయాడు అవధాని.

వీళ్ల సంభాషణల గడబిడ వింటున్న మాణిక్యం రాధమ్మను పిలిచింది.

'ఎందుకీ అనవసరపు గొడవలు! నా పిల్లలను నేను ఎలాగైనా పోషించుకోగలను! ఎవ్వరూ నాకు సహాయం చెయ్యనక్కర్లేదు' మాణిక్యం మొండి ధైర్యంతో అనేసింది.

పరంధామయ్య బండిఎక్కేముందు మాణిక్యం దగ్గర సెలవు తీసుకుని రాధమ్మను పిలిచాడు.

'ప్రకాశాన్ని యీ ఏడుతో చదువు మాన్పించెయ్యండి. నేనెక్కడైనా కోమటి కొట్లో గుమాస్తాపని ఇప్పిస్తాను. దానితో వాడికుటుంబాన్ని పోషించుకోగలడు' అవధానితో యీ మాటలు చెప్పమన్నట్లు రాధమ్మతో అని, పరంధామయ్య దకదకపోయి బండిలో కూర్చున్నాడు.

ఈ మాటలు విన్న అవధాని క్రోధంతో రుద్రుడై వెళ్ళిపోతున్న అన్నగారివైపు చురచురా చూశాడు.

'గొప్ప సలహా యిచ్చేడులే' అవధాని రాధమ్మవైపు పళ్లు కొరుకుతూ చూశాడు.

నిమీలిత నేత్రాలతో, భార్యపిల్లలు వెనకాల రైలుపెట్టెల్లా నడువగా. వరుసగా, గొంగళిపురుగు కొమ్మనుంచి జారినట్లు, మాటా మంతీ, సెలవు తీసుకోడం, ఏమీ లేకుండా మెల్లిగా జారుకున్నారు శాస్త్రి.

సీతమ్మ తనభర్తకు ఏవో అర్జంటు పనులున్నాయని చెప్పి, బలవంతంగా భర్తను వెంటబెట్టుకుని కాకినాడ వెళ్లిపోయింది అసాయంత్రమే!

'పాపం! ఎవరో ఒకరు ఆదుకోవాలి! ఎవరూ ఆదుకోపోతే ఎల్లాగర్రా!' అంటూ పన్నెండురోజులు తిన్న భోజనాల రుచులు జ్ఞాపకంవచ్చి, నోళ్లు చప్పరిస్తూ వచ్చిన ఆడంగిబంధుజనం గృహోన్ముఖులైనారు.

ఆరోజురాత్రికి నరసింహం ఇంట్లో, అతని కుటుంబంకాక, రాధమ్మ, అవధాని, మాత్రం మిగిలారు.

బంధువుల సంభాషణలన్నీ విన్న ప్రకాశం లోలోపల కాలరుద్రుడైపోయాడు. తండ్రి ఉన్నప్పుడు కూడా యీ బంధుజనం వీలైనప్పుడల్లా తనయింటికి వచ్చి, దక్కగా భోజనాలుచేసి, యిచ్చిన క్రొత్తబట్టలు కట్టుకుని తండ్రిని పొగడుతూ పోయినవారే. తండ్రి చనిపోగానే ఎవ్వరికీ తమ గొడవ అవసరం లేకపోయింది. అసలు బంధువులను నమ్మకూడదని తీర్మానించుకున్నాడు ప్రకాశం. స్వశక్తితో ఏదోవిధంగా చెల్లెలిని, తమ్ముణ్ణి, తల్లిని పోషించుకోగలననుకుంటూ దెబ్బతిన్న ఆత్మాభిమానంతో లోలోపల కుమిలిపోయాడు ప్రకాశం.

రాత్రి భోజనానికి అవధాని పిల్లలతో కూర్చున్నాడు.

'మాణిక్యం! బ్యాంకిలో నరసింహం దాచిన సొమ్ము ఎంత ఉంది?'

'రెండువందలు!'

ఒకక్షణం నిశ్శబ్దం.

'ఎల్లుండి విజయనగరం బయలుదేరదామనుకుంటున్నాను'

మాణిక్యం గుండె గబగబ కొట్టుకోసాగింది.

'మిమ్మల్నందరినీ తీసుకువెళ్ళిపోతాను'

మాణిక్యంగుండె దిటవుపడింది. విషాదం మిళితమైన ఆనందం ఆవేశించింది ఆమెను.

'ప్రకాశం పరీక్షలు అయ్యేదాక రాధమ్మ యింట్లో కాకినాడలో ఉంటాడు. తర్వాత నాదగ్గరకు వచ్చేస్తాడు.'

ప్రకాశం సంతోషంగా అవధాని మామయ్యవైపు చూశాడు.

'వీర్రాళ్ళిద్దరికీ చదువులు నే చెప్పిస్తా. కాంతకు పెళ్ళి నేనేచేస్తా. నే బ్రతికినంత కాలం మీరు నాతోటే ఉండవచ్చు!'

గబగబా విసురుగా అంటున్న అవధాని మాటలు నిజమూ, కోపమూ అనే సందిగ్ధంలో పడింది మాణిక్యం మళ్ళీ.

'నువ్వేమీ బెంగపెట్టుకోకు మాణిక్యం! నే బ్రతికిఉండగా నరసింహంపిల్లలు ముష్టెత్తుకోనక్కర్లేదు!!' అవధాని కన్నుల నించి జలజలా నీరుకారి అన్నంలో పడింది. ఆనందం, విషాదంతో ఉక్కిరిబిక్కిరయారు రాధమ్మ, మాణిక్యం.

సాంబు, కాంత, ఏడ్చేవాళ్లందరివైపు నిర్ఘాంతపోయి చూడసాగారు. ప్రకాశం, చిట్టిబాబు, పరిస్థితులు అర్థంచేసుకుంటూ ఆత్రంగా అవధాని మామయ్యవైపు చూశారు, కలిపిన ముద్దలు కంచాలలో వదిలి.

మంచులోంచి సూర్యకిరణాల వెలుగు చీల్చుకు వచ్చినట్లు, అవధాని విషాద వదనం లోంచి నవ్వురేఖలు వెల్లివిరిశాయి.

అవధాని నిశ్చయం రాధమ్మకు నచ్చింది.

కాని లోపల ఒక సంశయం ఆమెను బాధిస్తోనే వుంది.

'మరి నీ పెళ్ళిసంగతి...' వాక్యం పూర్తిచెయ్యకుండా నమిలేసింది రాధమ్మ.

'పెళ్లి యింక చేసుకోదల్చుకోలేదు'.

అవధాని నవ్వేశాడు. అంత ముఖ్యమైన విషయం చాలా తేలిగ్గా తీసిపారేయడం రాధమ్మకు నచ్చలేదు.

'మా కోసమని నువ్వు పెళ్ళి మానుకోడం ఏం బాగుంది అన్నయ్యా!' మాణిక్యం దీనంగా అడిగింది.

'మీ కోసం కాదమ్మా! అసలు నేను పెళ్ళి చేసుకోదల్చుకోలేదు!'

'మరి! నరసింహానికి వ్రాసిన ఉత్తరం మాటః?' రాధమ్మ ముఖం చిట్లించింది. "మేమైనా వెళ్లి పెళ్లి స్థిరపరుస్తాము. నువ్వు మానడం నాకు సుతరామూ యిష్టం లేదు. ఈ కుటుంబమంతా నువ్వొక్కడివే భరించనక్కరలేదు. నేనూ ఆదుకుంటాను! వీళ్ళని పోషిస్తే; పెళ్లి చేసుకోడం వీలుకాదని మాత్రం అనుకోకు!"

'మీ పరంధామయ్యలా నాకేమీ సలహాలివ్వకు అనవసరంగా' కసిరాడు అవధాని.

రాధమ్మ మరి మాట్లాడలేకపోయింది.

భోజనం ముగింపుకు వచ్చింది.

'ఊళ్లో అప్పులన్నీ తీర్చేసినట్లేనా?' అవధాని మాణిక్యంవైపు చూశాడు.

'ఆc. నువ్వు పంపిన అయిదువందలుతో తీర్చేశారు/ ఇంకేమీ లేవనుకుంటా!'

అవధాని సంతృప్తితో భోజనం ముగించి, 'త్వరగా లెండర్రా!' అంటూ ముద్దలు నములుతున్న కుర్రాళ్లకు హెచ్చరికచేసి, లేచాడు.

ఇంట్లో దాసీదానిద్వారా ఊరంతా వ్యాపించిపోయింది. నరసింహం కుటుంబాన్ని అవధాని పోషిస్తాడని, విజయనగరం తీసుకువెళ్లుతున్నాడని.

ఊళ్లో అంతా కుర్రాళ్ళ అదృష్టం పొగిడారు.

'నరసింహం మంచివాడు కనుక, అతని కుటుంబానికి అన్నోదకాలకు లోటు కల్గలేదు.'

'నారుపోసినవాడు నీరుపొయ్యడూ!'

'మనం ఏదో బాధపడుతూంటాము కాని, ప్రతిసమస్యకు ఒక పరిష్కారమార్గం చూపిస్తాడు దైవం'

ఎవరికి తోచినవిధంగా వాగు అనుకున్నారు నరసింహం కుటుంబంగురించి.

పదునాల్గవగోజున సామాన్లు అన్ని కట్టించి, బళ్లకెక్కించి, యిల్లు కాళీచేసి, మాణిక్యం, రాధమ్మ, పిల్లలను వెంటబెట్టుకుని అవధాని బయలుదేరి కొకినాడ వచ్చేశాడు. అక్కడ పాతస్నేహితులను కలుసుకుంటూ రెండు దినాలు గడిపాడు. తరువాత మాణిక్యాన్ని, కాంతను, సాంబును, తీసుకుని విజయనగరం చేరాడు అవధాని.

## 8

అవధాని కావమురిది చనిపోయాడని తెలిసి రామమూర్తి పరామర్శించడానికని అనకాపల్లినుంచి విజయనగరం వచ్చేడు ఒకరోజు.

"ఇంత హఠాత్తుగా ఎలా చనిపోయేడోయి. పిడుగులాంటిమనిషి నలభైరెండు సంవత్సరాలైనా దాటలేదు!" ఆశ్చర్యం వెలిబుచ్చాడు రామమూర్తి.

'అంతా విధి' ఒక్కమాటలో సమాధానం చెప్పాడు అవధాని.

'లేచిపోయినవాడు యింటికి వచ్చి సంసారం దిద్దుకుంటున్నాడని సంతోషిస్తే ఇంతలో యీ ప్రమాదంవచ్చిందన్నమాట!!' రామమూర్తి సానుభూతితో నిట్టూర్పు విడిచాడు.

నరసింహం అంత్యక్రియల దినాలలో బంధువుల ప్రవర్తనగురించిన సంగతులన్నీ పూసగుచ్చినట్లు రామమూర్తికి వినిపించాడు అవధాని. అన్నీవిని రామమూర్తి స్వార్థపరులైన బంధువులను అసహ్యించుకున్నాడు.

'నువ్వు ఇక్కడకు రావడం ఎలాగా వచ్చావు? ఒక సంగతి చెప్పేద్దామనుకుంటున్నాను...ఇంక జీవితంలో పెళ్ళిచేసుకోకూడదని నిశ్చయించుకున్నానోయి!'

నిశ్చేష్టుడయ్యాడు రామమూర్తి. ఇంతవరకు లీలను పెండ్లిచేసుకుంటాడనే ఆశతో, ఆమె తండ్రిని ఒప్పించి వివాహానికి సన్నాహాలు చేస్తూ ఒక ముహూర్తంకూడా నిర్ణయించాడు. ఈ పరిస్థితుల్లో అవధాని నిశ్చయాలమార్పు రామమూర్తిని కలవరపెట్టింది.

'ఇంతలో పెళ్లి మానుకోవలసిన అగత్యం ఏంవచ్చింది?'

"మానవుడు తన పరిస్థితులనుబట్టి జీవితాన్ని సరిదిద్దుకోవాలి. ఆ దిద్దుకోడంలో స్వార్థాన్ని త్యజించి త్యాగం చూపాలి. నరసింహం చనిపోవడంవల్ల అతనికుటుంబం సముద్రంలో చుక్కాని ఊడిన పడవలా తయారయింది. ఇది ఒకఒడ్డున చేరాలంటే ఒక మనిషి పూర్తిగా ఆదుకోవాలి. మనవా సామాన్యజీవితాలు! ఎన్నో ఇక్కట్లు వస్తాయి! అన్నీ అడ్డుకోవాలి! నరసింహానికి నేను చెయ్యగలిగే త్యాగం ఇది ఒక్కటే అని నాకు తోస్తోంది" గంభీరంగా హృదయంలోంచి ప్రతిధ్వనించాయి అవధాని మాటలు.

'దీనికి పెళ్లి మానుకోవలసిన అవసరం ముంది?'

'నువ్వు చూస్తున్నావుగా! సంసారాలు పెంచుకుంటే ఎవరు ఎవరికి సహాయం చెయ్యగల్గుతారు? ఒక విధంగా అన్నయ్యా, శాస్త్రి స్వార్థం చూపారంటే వాళ్లి తప్పే ముంది? అటువంటి స్వార్థం నన్ను కబళించి, జయించకుండా తప్పుకోడానికే పెళ్లి మానుకోదల్చుకున్నాను.'

'లీల నీ ఉద్దేశాలకు అనువుగా ఉండే మనిషి. భార్యాభర్తలు కలిస్తే, నీ ఆశయం ఇంకా చక్కగా నెరవేరుతుందని నా అభిప్రాయం.'

'లీల అనుకూలమైనది కాదని నే ననటం లేదు. ఈ పరిస్థితులలో నేనే ఆమెకు తగిన వాణ్ని కాను. మన సామాన్య జీవితాల్లో అందరూ సంసారాల్లో మునిగి స్వార్థంలో తేలుతూంటే, కుటుంబాల్లో రెక్కలురాని అనాథులను ఆదుకోగలిగే స్వార్థత్యాగి ఒకడు ఉండడం అవసరం. ఈ అవకాశం నేను వినియోగించుకోగలిగితే నా జీవిత సిద్ధాంతాలు కార్యరూపం పొందినట్లే.' అవధాని మాటల్లో నిండైన నిశ్చలత్వం, నైర్మల్యాన్ని చూసి ఇంక వాదం చేసి అతని హృదయాన్ని కలుషితం చెయ్యకూడదనుకున్నాడు రామమూర్తి. అవధానితో స్నేహం చేస్తున్నప్పటినుంచి అతని విశిష్టత, సంకల్పాలు, విచిత్ర ఆశయాలు గమనిస్తూనే ఉన్నాడు. అవే నిజంగా రామమూర్తిని అవధానివైపు ఆకర్షించాయంటే అతిశయోక్తి కాదు.

'సరే నీ యిష్టం' అంతటితో పెళ్ళి ప్రసంగం అంతమయింది.

రామమూర్తి రెండుగోజులు అవధానితో కాలక్షేపం చేసి వెళ్ళిపోయాడు.

పెద్ద బంగళా – ఎగురుగా పెద్దపెద్ద మఱ్ఱిచెట్లు ఆ నీడలలోంచి వీచే చల్లగాలి - వరండాలో అందమైన అరడజను పేము కుర్చీలు, ఇంటి ముంగిట్లో ఒక చిన్న పూలతోట - గోడలనిండా అందమైన బొమ్మలు, ఫోటోలు యివన్నీ చూస్తున్న సాంబు, శాంత, ఏదో స్వర్గంలోకి వచ్చినట్లు భావించుకున్నారు. అవధాని వాళ్లను విజయనగరం తీసుకు వచ్చాక మంచి బట్టలు, జోళ్ళు కొని యిచ్చాడు.

రోజూ ప్రొద్దున్నే లేచి తల్లి పెట్టిన భోజనాలు ముగించి, చక్కటి దుస్తులు వేసుకుని, నౌకర్లు దాసీలు పెట్టే సలాములకు సంతోషిస్తూ, కిలకిలా నవ్వుతూ గంతులు వెయ్యడానికి వీధిలోకి పోయేవారు శాంత, సాంబు. ప్రక్క బంగాళాల్లో ఉంటున్న పిల్లలు కొందరు స్నేహితులయ్యారు. నీటుగా ఆంగ్లో ఇండియన్ పిల్లల్లా క్రాపు చేయించుకుని, వచ్చీరాని ఇంగ్లీషు ముక్కలు విసిరే నాయుళ్ల పదేళ్ల పిల్ల...సగం తెలుగు కలిపి మాట్లాడే బంగాలీ కుర్రాడు...బట్టలు లేక లంగాతో కిచకిచలాడుతూండే తోటమాలి కూతురు...వీళ్ల స్నేహబృందంలో చేరిపోయారు. గాలిపటాలు–గోళీకాయలు–గుజ్జనగూళ్ళు - నాటకాలు - పాటలు - చెడుగుడు - దాగుడుమూతలు ఇంక చెప్ప లేక్కర్లేకుండా యిష్టమొచ్చినట్లుగా గల్లంతు చేస్తూ ఆటలు ఆడుకుంటూ అల్లరి చెయ్యసాగారు. అవధాని యీ అల్లరి అంతా చూస్తున్నా, కొన్నాళ్లు తండ్రి చనిపోయిన పిల్లలు, బాధ మరిచిపోడానికి అల్లా వదిలి వేయడమే మంచిదనుకున్నాడు. తన విరామకాలంలో ఆ పిల్లల నందరినీ పిలిచి వాళ్ళచేత ఎన్నో ఆటలు ఆడించి, టీపార్టీలు చేసి, సినీమాలకు తీసుకువెళ్ళి, కావలసిన ఆనందం అంతా వాళ్ళకు అందుబాటులో ఉండేటట్లు చెయ్యసాగాడు.

పిల్లల ఆనందం చూసి ఒకకంట ఆనంద బాష్పాలు రాలుస్తూ, భర్తమరణానికి ఒక కంట విషాదబాష్పాలు రాలుస్తూ మాణిక్యం ఒక్కతే ఇంట్లో కాలంగడిపేది. రాత్రిళ్లు పిల్లలు భోజనాలు చేసి నిద్రపోయాక, అవధాని కొంత తీరుబడి చేసుకుని మాణిక్యానికి, భగవద్గీత వినిపిస్తూ వైరాగ్యబోధ చేసేవాడు.

కాకినాడలో పరీక్షలు పూర్తయ్యాక ప్రకాశం విజయనగరం వచ్చేశాడు. ప్రకాశానికి, సాంబుకు, ప్రవర్తనలో, అభ్యాసాలలో, దృక్పథాలలో, ఎంతో భేదం ఉన్నట్లు గమనించాడు అవధాని.

ప్రకాశం రోజూ ప్రొద్దున్నే లేచి స్నానంచేసి, ఇంట్లో ఏమన్నా అవసరం ఉంటే చూసుకుని తన ట్రంకుపెట్టె ముందు పెట్టుకుని కూర్చునేవాడు. పెట్టెలోని పుస్తకాలు కాగితాలు, సర్దుకుంటూ, ఏదో రాసుకుంటూ, ఏవేవో ఆలోచించుకుంటూ ఎంతో కాలం గడిపేవాడు. ఒకరోజు అవధాని ఆ పెట్టెలో ఏమున్నాయో అని ప్రకాశం లేనప్పుడు వెదికాడు. రెండు సంవత్సరాలక్రితం నాటి డైరీ - అందులో తండ్రిఫోటో చిన్నదొకటి — డైరీలో అక్కడక్కడ తల్లిదండ్రులు చెప్పిన హితవులు, సగం అరిగిన పెన్సిళ్లు, రబ్బర్లు .. పాతపెన్నులు రెండు – గాంధీ, నెహ్రూ, ముసోలినీ, హిట్లరు - నెపోలియన్ - టాగూరు - మొదలగువారిగురించి ఇంగ్లీషులో ఉన్న సంగ్రహ జీవితచరిత్రలు - స్కూలుపుస్తకాలు - మొదలైనవి కనిపించాయి. అవన్నీ చూస్తూంటే, ఎంతో జాగ్రత, వస్తువుల విలువ గ్రహించేశక్తి - నిరాడంబరత - ప్రకాశం అర్థంచేసుకున్నాడని తెలుసుకున్నాడు అవధాని. రాత్రిళ్ళు చల్లగాలివీచే వరండాలో చాప, బొంత, ఒక తలగడాతో సంతృప్తిపడి ప్రకాశం నిద్రపోయేవాడు. ఇంట్లో మంచాలు, పరుపులు వాడుకోమన్నా వద్దంటూ మానేసేవాడు. తనకాలాన్ని ప్రతినిమిషం జాగ్రత్తగా వినియోగించుకుంటూ ఏవేవో పుస్తకాలు చదువుతూ కూర్చునేవాడు. ఒక్కొక్కసారి రోజులతరబడి ప్రకాశం చేతుల్లో సంగ్రహజీవితచరిత్రలు కనిపించేవి.

'ఇవి ఎక్కడివిరా?' ఒకరోజు అవధాని యథాలాపంగా అడిగాడు.

'నాన్న కొని పెట్టారు!'

'ఎప్పుడు'

'కోటిపల్లితీర్థంలో'

'అర్థమయింది అవధానికి ప్రకాశం ఆ పుస్తకాలపై చూపే ఆసక్తికి కారణం. తండ్రిమీద ఉన్న మమకారం ప్రకాశానికి నిజంగా ఆ పుస్తకాలలోని వీరుల అనుభవాలు ఆశయాలు గ్రహింపచేసే శక్తియిస్తే, అదృష్టవంతుడు కావచ్చు. అనే సంతృప్తితో నవ్వుకున్నాడు అవధాని.

తండ్రి చనిపోయినప్పుడు బంధువులు చూపిన స్వార్థం, నిరాదరణ, చూసినప్పటి నుంచీ ప్రకాశానికి లోలోపల ఒక ఆశయ జ్వాల రగుల్కొంటోంది. జీవితంలో ఎప్పటికైనా యీ బంధువుల నందరినీ

మించిన అంతస్థును ఆక్రమించుకునే, అదృష్టము సంపాదించాలనే తీవ్ర ఆకాంక్ష అతనిలో బయలుదేరింది. తండ్రి కొని యిచ్చిన వీరుల సంగ్రహచరిత్రలు చదివిన కొద్దీ, వాళ్లు చాలమంది తనలాగే సామాన్యకుటుంబంలోంచి పైకి వచ్చినవారని తెలిసి, ప్రకాశం తన ఆశయాలు కూడా తప్పక నెరవేరగలవనే ఆశలు అల్లుకోసాగాడు. అవన్నీ సాధించాలంటే, వాళ్లలాగే కష్టాలు ఎదుర్కోవాలి. ఈ కష్టాలుకూడా అందుకే కాబోలు అనుకునేవాడు ప్రకాశం.

సాయంత్రం వీలైనప్పుడల్లా ఒంటరిగా షికారు పోయేవాడు ప్రకాశం. సినిమాకి రమ్మన్నా వెళ్ళేవాడు కాదు. ఆ బంగళా వెనకాల కొండలమధ్యనుంచి త్రవ్విన రహదారులు నిర్జనంగా ప్రశాంతంగా ఉన్నాయి. ఆ రోడ్లవెంట నడచి, ప్రకృతిసౌందర్యాన్ని తిలకిస్తూ, ఆ సౌందర్యం అంతరాంతరంలో ఏదో అనుభవవేద్యమైన అపూర్వశక్తి ఉందని భావించేవాడు. ఆది, అంతం, కనిపించక, అంతా విచిత్రంగా కనిపించే ప్రకృతిలోని ప్రతీ శక్తినీ అర్థం చేసుకుని పూర్వకాలపు ఋషీశ్వరుల్లా కాలం గడిపితే బాగుంటుందేమో! చిన్నప్పుడు తోలుబొమ్మలు, హరికథలు, పురాణాలు, తీర్థాలు, గుళ్లు, మొదలైనవన్నీ ఎక్కువగా చూడడంవల్ల, వాటి సంబంధమైన తలపులు... నేడు ఎదురుగా జీవితంలో అంతా అయోమయంగా కనిపించే భవిష్యత్తు - ఈ రెంటినీ సమన్వయం చేసుకోడానికి వైరాగ్యమార్గ మొక్కటే ప్రకాశం దృష్టికి తగులుతోంది. తన జీవితం వైరాగ్య విధానాలమీద నడిపించాలనే ఆశయం పెట్టుకున్నాడు ప్రకాశం.

సాంబు, ప్రకాశంకన్న రెండేండ్లు చిన్న. కాని ఊహాలలో గ్రహణశక్తిలో, ఆశయాలలో, ఇద్దరికీ ఎంతో వ్యత్యాసం కన్పిస్తోంది. సాంబు ఎప్పుడూ అల్లరి, భోజనం, ఆటలు, నిద్రతప్ప, ఒక్కసారైనా పుస్తకాలవైపు దృష్టిపెట్టడం మానేశాడు. అదైనా తల్లికాని, అవధాని కాని చదువుకోవేంరా?' అని కేకలేస్తే బలవంతాన రాత్రిళ్లు కాస్త పుస్తకాలు తెరిచి జోగుతూ కూర్చునేవాడు. అటు అన్న తన పుస్తకాలలోను, ఇటు అవధాని తన ఆఫీసు పనిలోనూ, నిమగ్నులం కాగానే, తన చెల్లెలినికూడా వుసికొల్పి, ప్రక్కయింటి పిల్లలతో చేరి ఆటలకుపోడం అలవాటైపోయింది వాడికి. ఒకసారి అవధాని వాడిఆటలు గమనించాడు. గుజ్జనబువ్వలు ఆడుకుంటున్నారు. నాయిల్లీ అమ్మాయిని తన భార్యగానూ, బంగాలీ కుర్రాడిని తన బంట్రోతుగానూ, మాలికూతుర్ని ఇంట్లో దాసీదిగానూ, చెల్లెలిని వంటలక్కగానూ, వివిధ ఉద్యోగాలు నిర్ణయించి, తాను యింటియజమానిలా ఆర్డర్లు జారీచేస్తూ, నాయిల్లీ అమ్మాయితో వింత కబుర్లు చెబుతూ, పంఖాతో విసిరించుకుంటున్నాడు, దర్జాగా కాలిమీద కాలు వేసుకుని. అవధాని లోలోపల నవ్వుకుంటూ వచ్చేశాడుకాని బాల్యచేష్టలకు, భవిష్యత్తుకు ఏమన్నా సంబంధం ఉంటుందా అనే అనుమానం అతనికి తట్టకపోలేదు. సాంబును, ప్రకాశాన్ని కూర్చోపెట్టి తెలుగు, ఇంగ్లీషు పుస్తకాలు చదవమనేవాడు ఒకొక్కప్పుడు అవధాని. పుస్తకం మొదటినుంచి చివరిదాకా చదివేయకలిగేవాడు ప్రకాశం. ఒకొక్కసారి కొన్ని మాటలకు అర్థం తెలియక, తక్షణం అడిగి తెలుసుకునేవాడు. సాంబు పుస్తకం తెరిచి మొదటివాక్యందగ్గర ఆగిపోయేవాడు. దేనికైనా అర్థంచెప్పినా అది మర్నాటికే మరిచిపోయేవాడు. ఒకరోజు సాంబు మందమతికి అవధానికి కోపంవచ్చి, యీపద్ధతిలో చేసి బాధపడతాడని బుద్ధిచెప్పాలని సాచి లెంపకాయ కొట్టబోయాడు. చమత్కారంగా బుర్రవంచుకుని సాంబు తప్పించుకున్నాడు. ఆవిసురులో అవధాని చెయ్యి గిర్రుమని తిరిగి వారంరోజులు బెణుకు పెట్టింది. అనవసరంగా తండ్రిలేని పిల్లవాడిపై చెయ్యిచేసుకున్నానని పశ్చాత్తాపపడ్డాడు అవధాని. కాని సాంబుముందుచదువు ఎలా ఉంటుందా అనే భయం అతన్ని వదలలేదు.

వేసంగిసెలవులు గడిచిపోయాయి. రాధమ్మ ఉత్తరం వ్రాసింది. ప్రకాశం, చిట్టిబాబు ఫోర్తుఫారం ప్యాసయ్యారని, ప్రకాశానికి చాలా సబ్జక్టులలో ఫస్టుమార్కులు వచ్చేయని. పరీక్షల ముందే తండ్రి చనిపోయినా, బెంగ మానుకుని, జాగ్రత్తగా చదువుకుని మంచి మార్కులు తెచ్చుకున్న ప్రకాశంపై అభిమానం పొంగుకువచ్చింది అవధానికి. ఈ ఏడు కూడా చిట్టిబాబుకు సహాయంగా ఉంటాడని ప్రకాశాన్ని కాకినాడలో చదివించమంది రాధమ్మ. ఆమె కోరిక కాదనలేకపోయాడు అవధాని. ప్రకాశం చదువు ఖర్చులు తనూ, భోజన ఖర్చులు రాధమ్మా, భరించుకుందామని నిర్ణయించుకున్నారు.

ప్రకాశం అయిదవ ఫారం చదవడానికి కాకినాడ వెళ్లిపోయేడు. తనకున్న ప్రతిష్ఠవల్ల సాంబును విజయనగరంలో ఒక స్కూల్లో రెండవ ఫారంలో చేర్పించాడు అవధాని. ఇంతకు చదువు చెప్పడానికి ఒక ట్యూటరును నియోగించాడు.

కాలం మెల్లిగా కదులుతూంది. చెట్లు ఆకులు రాల్చుకున్నాక, మళ్లీ చిగురు ధరించి, మొగ్గలు తొడిగి, పువ్వులు పూసి, పిందెలు వేస్తున్నాయి. ప్రకాశవంతమైన సూర్యుని వెలుగులో తెల్ల మేఘాలు తునకలతో వెలుగుతూ ఆకాశంలో పరుగెత్తుతున్నాయి. మార్పుల కాలాన్ని పర్యాలోకిస్తూ మలయపవనం హాయిలో మందహాసం చేశాడు అవధాని.

(ఇంకా వుంది)




# జీవన సామరస్యము

'కుటుంబ జీవితమొక కళ' అంటాడు ఆంద్రే మొరాయ్. మిత్రులు బుద్ధికుశలతకు, ప్రియురాలు రూపయౌవన విలాసాలకు ఒక వ్యక్తిని ప్రేమిస్తారు. కాని స్వకుటుంబము ఆ వ్యక్తిమీద చూపే ప్రేమ కారణాలచేత నిరూపించరానిది. ఆ వ్యక్తి దేశదేశాలు తిరిగి లోకప్రఖ్యాతి గాంచినా, లక్షలకొలది ధనమార్జించినా, దేశాలకు సంఘాలకు నాయకత్వము వహించినా, కళావేత్త అయినా, లోకమంతా తనపట్ల చూపే గౌరవము సమర్పించే కానుకలవల్ల కలిగిన తృప్తికంటె, తనవాళ్ళు అందరూ - తన కుటుంబీకులు ఆప్యాయముగా 'ఏమిరా' అని పలకరించి, ప్రీతితో పెట్టిన పట్టెడు మెతుకులతో ఆనాడికి బ్రహ్మానందము కలుగుతుంది.

జననిమీద, జన్మభూమిమీద ఉన్న ప్రేమ, స్వజనముమీద, ఒక రక్తము పంచుకొని పుట్టిన తోబుట్టువులమీద, మమకారము ఎవరికి ఉండదు? వాత్సల్యపూరితమైన కుటుంబ వాతావరణాన్ని ఎవరు కాంక్షించరు?

"మా చిన్నప్పుడు మేము ఏది కావాలంటే అది మా అమ్మ యిస్తూ ఉండేది. మేము ఎంత అల్లరిచేసినా కోపగించుకునేది కాదు. మా నాన్నగారయినా అంతే. ఎంత డబ్బు కావాలన్నా నవ్వుతూ చేతిలో పెట్టేవారు—" అని మిత్రులతో చెప్పుకోనివారు అరుదు.

"మా అమ్మ ఏలోకాన ఉన్నదో! కాఫీ గ్లాసు చేతబట్టుకొని 'లేవరా నాయనా!' అంటూ మంచము దగ్గర నిలబడేది" ఈ మాటలు ఎవరైనా చెప్పుతూ ఉంటే విన్న వాళ్ళ దేహాలు గగుర్పొడుస్తాయి.

ఇల్లిందల సరస్వతీదేవి

ఇటువంటి మాటలు వింటుంటే వాళ్ళ బాల్యదశ చాలా ఆనందమయమైనదనీ, స్వార్థరహితమైన తలిదండ్రుల వాత్సల్యముతో పెరిగారని అర్థమవుతుంది. కాని నిజానికి ఈ వయసులో చెప్పుకున్నంత మధురంగా బాల్యదశ గడిచి ఉంటుందా? అని తర్కించి చూస్తే చాలామంది జీవితాలలో ఇటువంటివి అనుభవములేని విషయాలుగా తేలుతాయి.

బాల్యదశ దాటి కౌమారము వచ్చిన తరువాత, మగపిల్లలకయినా ఆడపిల్లలకైనా సామాన్యముగా ఇంట్లో జరిగేది ఏదీ నచ్చదు. తల్లి చేసినవంటకంటె హోటెలులో చేసినదీ, హోటెళ్ళలో దొరికేది బాగున్నట్లనిపిస్తుంది. తల్లి తనను పెంచే పద్ధతి నచ్చదు. తల్లి మాటలు మోటుగా వినిపిస్తాయి. తమకు విద్య చెప్పించటములోను మిగతా పెట్టుపోతలలోను తలిదండ్రులు తగిన శ్రద్ధ కనబరచనట్టు తోస్తుంది. ఏదో వెలితీ లోపమూ కనబడుతూ ఉంటుంది; ఏదీ కాలానుగుణ్యముగా లేనట్టే తోస్తుంది "నా స్నేహితులకు నాతోపాటుగా కాఫీ ఇవ్వటానికి అమ్మ అట్లా విసుక్కుంటుందేమి? నేను రాత్రి రెండవఆట సినిమాకు వెళ్ళితే నాన్న అమ్మ అట్లా కోపపడతారెందుకు? ఒకరూపాయి ఖర్చుచేస్తే లక్షలు ఖర్చయినట్లు బాధపడతారేమి?" అన్న నిస్పృహలతో ఎంతోమంది కుమిలిపోతూ ఉంటారు. తనను సరిగా చూడలేని తలిదండ్రుల బంధనాలనుండి కష్టాలనుండి ఎప్పుడు విముక్తి కలుగుతుందా అని ఎదురు చూస్తూ ఉంటారు.

తలిదండ్రులకు కూడా వారిమీద సంతానానికి కలిగినదానికంటె సంతానముపట్ల వారికి అధికముగానే అసంతృప్తి కలుగుతూ ఉంటుంది. తాము సంతానముకొరకు చాలా కష్టపడ్డామని ఎంతో త్యాగము చేశామని వారు అనుకుంటారు. తమకష్టము సరిగా ఫలించలేదని బాధపడతారు. పిల్లలు తమయెడ భక్తిశ్రద్ధలను సరిగా కనబరచటము లేదని కించపడతారు. వారియెడ తాము చూపినవాత్సల్యానికి సరియైన ప్రతిఫలము కనబడదని విచారిస్తారు.

# ★ జీవన సామరస్యము ★

'మా చిన్నప్పుడు మేము ఎట్లా ఉండే వాళ్లమనీ!' 'మా అక్కయ్య' 'మా చెల్లెలు' 'మా అన్నయ్య' 'మా తమ్ముడు' అని ఎంతో ఆపేక్షతో చెప్పుకొనేవారు చాలామంది ఉంటారు. ఈ సామరస్యము, ఈ ప్రేమ, తమ తలిదండ్రులు బాల్యదశలో కల్పించిన వాతావరణముయొక్క ఫలితమని, చాలా మంది ఘనముగా చెప్పుకొంటూ ఉంటారు. కాని చాలామంది జీవితాలలో ఇవి కనివిని ఎరుగనివి. అక్కచెల్లెళ్ళూ అన్నదమ్ములూ ఒకవిధమైన అశాంతితోనే కాలము గడుపుతారు. ఎదటివారు తమను అర్థము చేసుకోలేదనే ప్రతి ఒక్కరూ బాధపడతారు. తనకున్న ఆపేక్ష, సహృదయత సర్దుబాటు నిదానము త్యాగము ఎదటివానిలో లేవు. అందరూ బాధ్యతా రహితులై తిరుగుతున్నారనిపిస్తుంది. తాము చిన్నవాళ్ళకొరకు కష్టపడుతున్నామని పెద్దవాళ్ళ కనిపిస్తే - తమను పెద్దవాళ్లు దబాయిస్తున్నారనీ, అన్యాయము చేస్తున్నారనీ చిన్నవాళ్ళ కనిపిస్తుంది. నలుగురు తోటి కోడళ్లుగల యింట్లో ప్రతి కోడలూ తానొక్కతే కష్టపడుతున్నాననుకుంటుంది. తానొక్కతే వేకువజామున లేచి ఇంటెడు చాకిరీ చేశాననుకుంటుంది. కొడుకులు కూడా ఇంతే. తానొక్కడే సమిష్టి కుటుంబానికి తోడ్పడుతున్నాననుకుంటాడు. కుటుంబమువల్లనే తాను తేరుకోలేక పోతున్నాననుకుంటాడు.

ఒక కుటుంబమువారు ఇతరులతో సహృదయతతో ప్రీతితో మెలగుతూ ఉంటారు. మిత్రులతో మరింత సన్నిహితులుగా ఉంటారు. కొందరు ఎంతో త్యాగమయినా చేయటానికి సిద్ధముగా ఉంటారు. కాని - స్వకుటుంబములో విధముగా మెలగలేరు. కాగా - 'అయినవాళ్ళకంటె స్నేహితులే నయము అన్నిటికీ!' అనుకుంటారు.

నిజానికి రక్తస్పర్శ, బాంధవ్యముగల వ్యక్తులు పరాయివాళ్ళకంటె దూరమవుతారా? బంధువులకంటె స్నేహితులే నయమనుకోవటములో ఎంత సత్యము, అవకాశము ఉన్నది?

ఒకఊరివాళ్లు మరొకచోట కలసికొన్నప్పుడు ఎంతో ఆప్యాయముగా కుశల ప్రశ్నలు వేసుకుంటారు; ఒకరి ఇంటికి ఒకరు ఆదరాభిమానాలతో వెళ్లుతూ ఉంటారు. విందులు, సినెమాలు, ఒకటేమిటి - ఒకయింట్లోఉన్నట్లే మెలగుతారు. ఇటువంటివారు ఒకఊళ్లో ఎంత సుహృద్భావములో ఉంటారోనని మనము ఆశించటము పొరబాటు. ఒక ఊరివాళ్ళల్లో ఒకరిమీద ఒకరికి అసూయ నిర్లక్ష్యము అగౌరవము సాధారణముగా ఉంటూనే ఉంటాయి. మనము ఎంతో మంచివాడు, మర్యాదస్థుడు అనుకొన్న వ్యక్తినిగురించి అతడి ఇరుగుపొరుగులను ప్రశ్నించిచూస్తే, ఈ విషయము బాగా బోధపడుతుంది. 'మంచివాడే - మర్యాదస్తుడే' నని పైకి తెచ్చిపెట్టుకొన్న మర్యాదతో అంటారు; కాని - మంచివాడు మర్యాదస్తుడు' అని స్పష్టముగా మనసార చెప్పలేరు. అయితే వీటిని పైకి కనబడనివ్వనివారూ, జుగుప్సను గెలిచినవారూ లోకములో లేరని కాదు. వీటితో సతమతమయేవారే ఎక్కువ.

అందరికీ ఈ విషయాలు నిత్యానుభవమే. వీటితో మనసులను కష్టపెట్టుకొనేవారూ, ఇతరులను కష్టపెట్టేవారూ, చాలామంది ఉన్నారు. వీటికై ప్రాణాలను బలియిచ్చినవారు, దేశత్యాగము, గృహత్యాగముచేసినవారు చాలామంది ఉన్నారు.

ఈ కష్టసుఖాలు తెలియనివారు, కారణాలను గ్రహించనివారూ అరుదు. అయితే నేమి — బాధపడటాన్ని మనలో చాలామంది కర్మ అనుకోవటము పరిపాటి. ఈ కర్మసిద్ధాంతాన్ని దైనిక జీవితములో ప్రతిదానికీ ముడిపెట్టి, చాలామంది తాము నిమిత్తమాత్రులమనుకుంటారు.

ఒక ఊరిలో వారుగాని ఒక వాడలో ఉన్న వారుగాని, ఒక కుటుంబములోని వారుగాని ఒకరిమంచిని మరొకరు గ్రహించే అవకాశం లేదా ? దేశదేశాలలో మారు మ్రోగిన మంచితనము స్వకుటుంబములోను ఇరుగు పొరుగుల వద్ద, గ్రామస్థులవద్ద, కన బరచుకోవటము అసాధ్యమా ? ఎంతవరకు సాధ్యము ? అని ప్రశ్నించుకొంటే ఇంట గెలిచి, రచ్చగెలవటమే ఉత్తమోత్తమ మన్నారు పెద్దలు.

ప్రతివ్యక్తీ సంఘములోగాని కుటుంబ ములో గాని మెలగవలసిన విధానాలు ఉన్నాయి. వీటిని సభ్యత మర్యాద అన వచ్చు. దీనికి ఐశ్వర్యముతో పేదరిక ముతో సంబంధము లేదు. ఆ వ్యక్తికి ఉన్న స్థానాన్ని బట్టి సభ్యతతో మెలగటము ఉత్తమమైన మార్గము. భారతదేశములో కొడుకుకంటె తండ్రి కనీసము 20 సంవత్స రాలయినా వయసులో పెద్దవాడై ఉం టాడు. తల్లి కనీసము 15 సంవత్సరాలయినా పెద్దదయి ఉంటుంది. పిల్లలకు సాధారణ ముగా 15 సంవత్సరాల వయసు వచ్చేసరికి తలిదండ్రుల కాలి చెప్పులు సరిపోతాయి. ఇంచుమించుగా తలిదండ్రులంత ఎత్తు పెరిగిఉంటారు. ఈ కాలములో పిల్లలకు సలహా రూపములో నచ్చచెప్పటమే తలి దండ్రులకు ధర్మము.

పిల్లల ఆటలు సరదాలు తలిదండ్రులు కనిపెట్టాలి. పిల్లలు తలిదండ్రులవద్ద భయ భక్తులు కలిగిఉండటము ఎంత అవసరమో చనవుగా ఉండటముకూడా అంత అవస రమే. ఒక్కొక్క తండ్రి ఇంటికి వస్తూ ఉండగానే పిల్లలు గదులలోకి మూలలకు పారిపోతారు. తండ్రి అయినా - పిల్ల లను పిలచి దగ్గర కూర్చుండబెట్టుకొని, మాట్లాడాలనుకోడు. పిల్లలకు తండ్రిని చూస్తే పులిని చూసినట్లుండటము, తండ్రికి పిల్లలయెడల తృణీకార భావము చిన్న చూపు ఉండటము చాలా కుటుంబాలలో ఉన్నదే. తలిదండ్రులకు పిల్లలకు ప్రపం చాలు వేరు; ఆశలూ ఆశయాలు వేరు; సమన్వయము సామరస్యము అందుబాటులో ఉండవు. ఈ స్థితిలో, తండ్రి కుమారునితో ఏదయినా చెప్పవలసివస్తే, ఎదటబడి నచ్చ చెప్పటము ఉండదు - ఆజ్ఞ యిచ్చినట్లుగా ఉంటుంది. తత్ఫలితముగా ఇద్దరిమధ్య విర సము ఏర్పడుతుంది. "నేను చెప్పిన ప్రకా రము నడచుకొని తీరాలి - లేకపోతే ఇంట్లో ఉండటానికి వీలులేదు" అని తండ్రి అన్న ట్లుగా - సంభాషణ ధ్వనిస్తుంది. కుమారుడు ఆ తండ్రికి కొడుకే గనుక - రోషముకొద్దీ - చెప్పులు వేసుకొని బయలుదేరుతాడు.

భార్యాభర్తలు అన్నదమ్ములు అక్క చెల్లెళ్లుకూడా ఇంతే. ఉదయము లేవగానే రేడియో పెట్టుకొని కూర్చోవాలని ఒకరికి ఉంటే, చప్పుడు మరొకరికి గిట్టదు. సంగీతసాధన చేసే చెల్లెలిమీద అన్నగారికి విసుగు కలుగుతుంది. అందరూ భోజనాలు చేసేవేళ స్నేహితులతో బయట తిరుగుతా నంటాడు ఒక సభ్యుడు. నలుగురు ఇంటికి రావటము ఒకరికి ఇష్టము - జనసందడికి ఓర్వలేరు మరొకరు. ఒకరిమీద ఒకరికి సాను భూతి ఆదరము అపేక్ష కనబడవు. ఒక యింట్లోనే ఉంటారు; గాని ఎవరికివారే పొట్లచెట్లు.

దీనికంతకూ కారణము ఒకరినొకరు మన్నించుకొనకపోవటమూ, గౌరవించు కొనకపోవటమూను. ఒకరిమీద ఒకరికి కృత జ్ఞతాభావను మందుకైనా కనబడదు. కాగా - "ఆఁ మనవాళ్లేగా! మనలో మనకు అటువంటి పట్టింపులు ఏమిటి?" అన్న ఔదాసీన్యముతో ఒకరియెడ ఒకరు ప్రవ ర్తించుతారు. తాడు తెగేవరకూ లాగుతారు. చేసిన అపరాధాలకు పొరబాట్లకు క్షమా పణలు కోరుకోరు. "ఆఁ! వన్నేం చేస్తా డులే!" అనుకుంటారు. ఇవిఏమీ చేసినట్లు పైకి కనబడకపోయినా మానసములను కలు షితముచేసి జుగుప్సలకు వైమనస్యాలకు ఎడ మిస్తాయి.

ప్రపంచమంతా సమభావముతో సర్వ మానవ సౌభ్రాతృత్వముతో, కలసిమెలసి ఉండాలని మనముఆశిస్తాము. దీనికి 'పునాది ఎప్పుడు పడాలి? ఎక్కడ పడాలి?' అని ఆలోచిస్తే, బాల్యదశలో, స్వకుటుంబ ములోనని తేలుతుంది. ఒక తల్లి కడుపున పుట్టిన వారందరు ఒక మాదిరిగా ఉండరు. ఒక విధమైన ప్రకృతి కలవారై ఉండరు. అందరికీ ఒగువులు ఒక మాదిరిగా అంటవు. రూపములో స్వభావములో భిన్నమైనట్లే వాళ్ల అదృష్టాలు కూడా భేదిస్తాయి. శక్తి సామర్థ్యాలు కూడా వ్యక్తిగతమైనవే. వీటిని ఆధారముచేసుకొని ఎక్కువ తక్కువలను గుణించుకొంటూ మెలగటమువల్లనే వైమన స్యాలకు తావు ఏర్పడుతున్నది. అందరూ మనసులు విప్పుకొని, ఉల్లాసముతో, పర స్పర వాత్సల్యముతో, మెలగటము ఏ కుటుంబములో నేర్చుకుంటారో అది అమృతము పుట్టినచోటు.

మానవునిలో సుహృద్భావము వాత్స ల్యము అభిమానము మొదలైనవి పెంపొం దించితే వృద్ధి అవుతాయి. మనసు ఒక ప్రత్యేక స్థాయి నందుకొన్నప్పుడే ఇవి ఉద్భవిస్తాయి. ఆ స్థాయిని తెలిసికొని, దానిని నిలుపుకొని, పోషించుకోవటము లోనే విద్య, విజ్ఞానము, సంస్కారము మానవుడికి తోడ్పడేవి.

వ్యక్తులమధ్య సామరస్యము త్రాసు వంటిది. ముల్లువైపు చూస్తూ సరుకును తూచాలి. ఏమాత్రము అజాగ్రతగాఉన్నా బరువు అధికముగా ఉన్నవైపుకు ముల్లు వంగిపోతుంది.

'ఈ ముల్లువైపు చూస్తూ గృహాన్నీ సంఘాన్నీ దేశాన్నీ నడపగల సమర్థురాలు స్త్రీ ఒక్కతే!' అంటాడు శరచ్చంద్రుడు.





# క్షణికం



బైట హోరుమని వర్షం! తలుపులన్నీ బంధించి భగభగమండే పొయ్యి ముందు కూర్చున్న సీతమ్మకి చిరాకు!

వీధిజాబిరీలో నిలబడి మిన్నూ మన్నూ కానరాకుండా కురిసే కుంభవృష్టిలో తోడ్డు కష్టింపడి పరుగెత్తే మనుషుల్ని వింతగా గమనిస్తోంది పాప. మధ్యమధ్య చిట్టి చేతులు చాపి చూరుమీంచి పడే నీటిధారని చెదరగొడుతూంది.

పాపనాన్న – అంటే సీతమ్మ భర్త – ఆఫీసులో బైట వర్షం కురుస్తున్నా వాతావరణం హిమవంతంలాగున్నా వేడెక్కి పొగలూ సెగలూ కక్కుతున్న మెదడుతో కుస్తీ పడుతున్నాడు. అతని చేతిలో ఎర్ర సిరా కలం వెనకభాగం నుదుటిమీద టక్కు టక్కుమని కొడుతూంది. ఆలోచనలు!

ఇరుగుపొరుగు అమ్మలక్కలు ఎవరిపనిలో వాళ్లు మునిగిపోయారు. గడియారం అయిదు గంటలు కొట్టింది.

జాబిరీలోంచి పాప వెనక్కి తిరిగి గడియారంవైపు చూసింది. పొయ్యిముందు కూర్చున్న సీతమ్మ గడియారం గదివైపు ఓమారు దృష్టి మళ్లించి మళ్ళీ తనపనిలో నిమగ్నురాలైపోయింది. కట్టెలు పొయ్యిలోకి ఎగదోసి విసినకర్ర తీసుకుని విసరసాగింది.

గిన్నెకు నాలుగువైపుల్నించీ మంట తాకుతుంటోంది.

యాంత్రికంగా ఆమె పొయ్యి విసురుతున్నా, ఆమె మెదడులో ఆలోచనలు ముసురుకుంటున్నాయి.

బైట వర్షపు ఉధృతానికి మూసిఉన్న కిటికీ రెక్కలు గింజుకుంటున్నాయి.

ఉండి, ఉండి గుండెలు గుభిల్లుమనేలా ఉరుములు!

నిజానికి తనకేలోటూ లేదు. జీవితంలో సుఖపడ్డానికి అవకాశాలు తక్కువ కావు! భర్తలో సౌమ్యత, మంచితనానికి ఏమీ కొరవలేదు. ఏళ్లు మళ్ళిన వృద్ధులు – తల్లీ తండ్రీ తన కింకా బ్రతికిఉండటం నిజంగా గర్వకారణం!

పెద్దపెద్ద భవంతులూ, కార్లూ, విమానాలూ లేకపోయినా ఉన్న దానిలో ఉన్నంతగా సుఖపడ్డానికి ఏలోటూ లేదు.

అటువంటి అర్థసాగరుడైన భర్త తనకి గర్వకారణం!

ముద్దుగా ముద్దుటగా ఉండే ఒక్కగానొక్క కూతురు పాప తనకి గర్వకారణం!

కాని...కాని ... సువక్షం కాని, అస్పష్టం అయిన...ఏదో...ఏదో...లోటు!

ఏమిటది?

ఏమో?

ఏమీ లేదు. అంతా ఉత్తిదే!

ఆ జబ్బు అందరికీ ఉంటుంది! అది లేందే మనిషి అనిపించుకోలేమో? ఏదో కసి... ఎవరిమీదో కోపం....ఎందుకో అసూయ! ఏదో ఒక జబ్బు! అయితే తన కెవరూ శత్రువులూ లేరే?

లేకేం? ఉన్న పెద్ద శత్రువల్లా తన మనసే!

## పురాణం సూర్యప్రకాశరావు

మంట అదృశ్యం అయింది ఉన్నట్టుండి. ఉన్నట్టుండి పొగ దృశ్యం అయింది.

ఎటూ పారిపోకుండా తలుపులన్నీ బంధించబడిఉన్న గదిలో తనముందు నిలబడి, తనమీద దృష్టిసారించి, తనమీదకు దాడిచేసే మనిషిని కళ్లుపీకి ఒళ్లు రక్కే మానుపిల్లిలా తన్ని చుట్టుముట్టింది పొగ.

కళ్ళు మంటలు! కళ్లు మూసే విసినకర్రల కోసం వెతుకులాటలు ... ఎందుకొచ్చిన అవస్థ! ఎప్పటికీ తప్పని అవస్థ! హూ! ఆడది! ఆడదాని బ్రతుకంతా అవస్థే!

చేతికి విసినకర్ర దొరికిన నాలుగు నిమిషాలకి కంటికి మంట కనిపించింది. కనిపించిన మంట మళ్ళీ అదృశ్యం కాకుండా సీతమ్మ తగిన జాగ్రత్త చూపించింది.

బైట వాన హోరు పెడుతోంది! పొయ్యిమీద అన్నం కుతకుత మంటోంది.

సీతమ్మ కత్తిపీటముందు వేసుకొని మామిడి కాయలు తరగటం ప్రారంభించింది. సీతమ్మ ముందున్న కత్తిపీట మామిడికాయల్ని తరగనని మొండికెయ్యటం ప్రారంభించింది! సీతమ్మ తాలూకు మనసు ఓపికని కబళించటం ప్రారంభించింది. "హు! వెధవ కత్తిపీట! పాడు కత్తిపీట! పదును పట్టించమని ఎన్నిమార్లు చెప్పినా వినిపించుకోరు"– ఆ విసురు భర్తమీదికి.

పిల్లిలా గదిలోకి ప్రవేశించింది పాప!

కత్తిపీటతో కుస్తీపడుతున్న తల్లి పక్కగా వచ్చి కూర్చుంది పిల్లిలా వచ్చిన పాప!

పాప పిల్లిలా వచ్చినా, పక్కన కూర్చున్నా సీతమ్మ గమనించనట్టుగా తన ధోరణిలో తనుండిపోయింది.

విసుకు విసుకుమంటూ ముటముట లాడుతున్న తల్లి ముఖంలోకి చూస్తూ కూచుంది పాప.

ఉన్నట్టుండి ఏదో స్ఫురించినట్టుగా పాప అలమారువైపు నడిచింది.

యథాలాపంగా తలెత్తిన సీతమ్మకి అలమారు రెండో అర అందుకుందుకు విశ్వప్రయత్నం చేస్తున్న పాప కనిపించింది.

"ఏమిటే? ఎందుకా దేవుళ్లాడటం?" అనే కేక పిడుగులా పాప చెవిని పడింది.

లక్ష్యాన్ని సాధించిన పాప వస్తువును గుప్పిటలో పెట్టుకుని మధ్య గదిలోకి దౌడు తీసింది.

సీతమ్మ రెండు చేతులూ విసవిసలాడిస్తూ అలమారు సమీపించగానే అనుకున్నట్టే అయిందని గ్రహించింది. అరణా కాసుల కింద ఉండాల్సిన కొత్త వెండి రూపాయి కనిపించలేదు.

ఆమె ఆవేశం ఉన్నతశిఖరాల నందుకుంది. పెద్ద పెద్ద అంగలు వేస్తూ మధ్యగది గుమ్మం దగ్గరకు నడిచే సరికల్లా కంటి ముందు దృశ్యం ఆమెను మరింత వెర్రెత్తించింది.

రూపాయితో పాపాయి ఆడుకుంటోంది చక్రంలా దొర్లుతూంది రూపాయి! రూపాయి దొర్లుతూ...దొర్లుతూ ... గోడ తూము వైపుకి పరుగెడుతోంది.

అరె!...అరె!...అరె!...సీతమ్మ ఒక్క ఉదుటున వెళ్ళి రూపాయిని ఆ తూముబారి నుండి రక్షించింది.

పాపాయి కాళ్లు నేలమీద చిందులు త్రొక్కటం ప్రారంభించాయి. చేతులు నేలమీద తపతప చరవటం ప్రారంభించాయి. నోరు పెద్దగా అరవటం ప్రారంభించింది.



**కలంటు**

—ఫొటో: వి పొన్నుస్వామి, మాయావరం

కళ్ళు రెండూ ముత్యాల్లాంటి కన్నీటి చుక్కల్ని విడవడం ప్రారంభించాయి.

"ఏడు! ఏడు! పాడుముండా! దాన్ని ఎక్కడో ఊరేగించేదాకా నీ కళ్ళు చల్లబడవు" అంటూ సీతమ్మ తిట్టటం ప్రారంభించింది.

అసలు కథ ఏమిటంటే ఆ ఉదయం సీతమ్మ భర్త రెండురూపాయల నోటు ఆమె చేతిలో పెట్టాడు. రెండు రూపాయలూ మారిస్తే రూపాయి అరణాలు మిగిలాయి. ఒక రూపాయి బిళ్ళా, ఆరు అణా కాసులూను. తళతళా మెరిసే ఆ రూపాయి పాప కంట బడింది. తినకేమ్మనీ, ఆడుకుంటానని అడిగింది.

సీతమ్మ అలా వల్ల కాదంది.

పాప ఏడ్చింది!

'పోనీ ఇద్దూ! మళ్లీ ఇచ్చేస్తుందిలే' అని భర్త అనటం తను విన్నది. ఈడ్చి నాలుగు తన్నులు తన్నింది! ఎవరినీ? పాపని!

"అడిగిందల్లా అందిస్తే గారంపెరిగి రాక్షసుల్లా తయారవుతారు పిల్లలు" అని సీతమ్మ అభిప్రాయపడింది.

"పోనీ చిన్నపిల్ల ఏదో అడిగింది కదా! ఇవ్వకూడదూ?" — అని అభిప్రాయపడ్డాడు ఆమె భర్త.

"తను అడగ్గానే ఆ రూపాయి తనకెందుకివ్వకూడదు?" — అని అభిప్రాయపడింది పాపాయి.

అప్పట్నించీ వీలుచిక్కినప్పుడల్లా, సందు దొరికినప్పుడల్లా, ఆ రూపాయి కాజెయ్యాలని ఆ రోజల్లా ప్రయత్నిస్తూనే ఉంది పాప. చివరికి ఇప్పటికి సాధించగలిగింది. కాని ఏం ప్రయోజనం? అమ్మ వచ్చి గద్దలా తన్నుకుపోయింది రూపాయిని! అమ్మ వచ్చి ఏడిపించి పోయింది పాపాయిని! వంటగదిలోకి అంబళ్కిలా వచ్చిపడి జుట్టు పీక్కోవటం ప్రారంభించింది పాపాయి! ఆయుధంలాంటి గొంతును ప్రయోగించి లొంగదీసుకుందుకు ఉద్యుక్తురాలయింది పాపాయి!

విసుగుదల, చిరాకూ, అనే ఆయుధాలకి ఎప్పుడో లొంగపోయిన సీతమ్మ పాపాయి నోటికి లొంగలేదు. అసలా గోడవే విని పించుకోనట్టుగా నిర్లిప్తంగా తన పనిలో తను మునిగిపోయింది.

"అసలు పిల్లలు ఇలాగే చెడిపోతారు" — అనుకుంది సీతమ్మ.

"ఈ అమ్మంటే నా కెందుకే కోపం" — అనుకుంది పాపాయి.

"పక్కింటి సుందరమ్మగారి అమ్మాయి చూడు పద్దెనిమిదేళ్లు వచ్చాయి. ఇప్పటికీ వాళ్ళమ్మ అన్నం తినిపించాలి, నీళ్ళు పొయ్యాలి, తల దువ్వి బట్టలు కట్టాలి. దాని దైనందిన కృత్యాలన్నీ అలా దాని ప్రమేయం లేకుండా జరిగిపోతూంటాయి. ఛీ! అసహ్యం వేస్తుంది! ఇరవైనాలుగ్గంటలూ వీధిగుమ్మందగ్గర ఒచ్చే పోయే కుసు

 # క్షణికం 

ఘల్లి చూస్తూ, చెరుగ్గడలో, తేగలో నములుతూ నిల్చుంటుంది. 'అలా నిలబడకూడదు! తప్పు!' అని కూడా ఎవరో చెప్పాలి. ఆ అమ్మాయి కీమధ్య పెళ్లి సంబంధం ఒకటి వచ్చింది. వచ్చిన పెళ్లికొడుకు రాగానే పిల్లనిచూసి గుటకలు మింగాడు గాని, ఎదురుగుండా కూచున్న పెళ్లికూతురు తల్లి ఏమరుపాటున వెనక్కి చూస్తుంటే ఉన్నట్టుండి ఒడ్లోంచి మోచేతి పొడుగు చెరుగ్గడ బైటికి లాగి పళ్లమధ్య ఇరికించి చీలుస్తుంటే కళ్లు తేలేసి నివ్వెరపోయి గ్లాసుడు మంచినీళ్లు తాగి బైటపడ్డాడు ఆ పెళ్లికొడుకు.

"అదేవిటే వెకిలి పనుగా" అని తండ్రి కోప్పడేసరికి "పోదురూ! మీరు మరీనూ! ఈ సంబంధం కాకపోతే దీని తాతలాంటి సంబంధం మరొకటి వస్తుంది. మన అమ్మాయి కేం! లక్షణంగా ఉంటుంది" అంటూ కూతుర్ని వెనకేసుకొచ్చింది సుందరమ్మ. ఆ తల్లి ఆ పిల్లని అలా గారంమప్పి పాడు చేసేసింది. అలాగే తన కూతురుకూడా పాడయిపోదూ? ఇలా నెత్తికెక్కించుకుంటే? - అనుకుంది సీతమ్మ.

పాప గీపెట్టి ఏడుస్తూనే ఉంది! కాళ్ళూ చేతులూ తపతపా కొడుతూనే ఉంది! జుట్టు పీక్కుంటూనే ఉంది. క్షణక్షణానికీ ఆమె కోపం పెరుగుతూనే ఉంది! బైట వాన కురుస్తూనే ఉంది. కిటికీ రెక్కలు గింజుకుంటూనే ఉన్నాయి!

సీతమ్మ ఓపికా, శాంతం హరించిపోతూనే ఉన్నాయి! పాప లేచి కొత్తపద్ధతిలో దాడి మొదలు పెట్టింది! పాప రెండు చేతులూ సీతమ్మవీపుమీద తాండవం చేశాయి! తనజుట్టుబదులు తల్లి జుట్టు పీకటం ప్రారంభించింది. సీతమ్మ విదిలించుకుంది. పాపాయి మీదికొచ్చి సీతమ్మ వీపుమీద శక్తికొద్దీ, కసికొద్దీ కరిచింది! సీతమ్మవీపు చుర్రుమంది. చుర్రుమంది పాపాయివీపు! గొల్లుమంది పాపాయి. చివరికిదో చిన్న యుద్ధంకింద తయారయింది.

ఆ యుద్ధపర్యవసానంగా పాపాయినుదురు గడపమీదపడి నెత్తురుచిమ్మింది. తల దిమ్మెక్కింది. ఒళ్లంతా నెప్పిచేసింది. తలెత్తి చూసేసరికి సీతమ్మ రౌద్రరూపం పాపని మరింత అశక్తురాలును చేసింది. చివరికి ఓటమి తనదిగా అంగీకరించక తప్పలేదు. మెల్లగా లేచి ఒక చేత్తో నుదురు నొక్కుకుంటూ మధ్యగదిలోకి నడిచి మంచంమీద కెక్కి బోర్లపడుకుని లోలోపల కుళ్ళికుళ్ళి ఏడవ సాగింది పాపాయి!

వర్షపుఉధృతం సడలిపోయింది! పొయ్యిమీద గిన్నెలో అన్నం ఉడికిపోయింది! వంటఇంటిపని పూర్తిచేసుకుని ఉస్సూరంటూ నిట్టూరుస్తూ పక్కలు వెయ్యటానికి మధ్య గదిలోకి వెళ్లింది సీతమ్మ.

* * *

రాత్రి పదిగంటలయింది! గడియారం గంటలు కొడుతూంది. టేబుల్ ముందు లైటు ముందు కూర్చుని రాసుకుంటూన్న సీతమ్మ భర్త తలెత్తి గడియారంవంక చూశాడు. కిటికీలోంచి చలిగాలి తెరలు తెరలుగా వీస్తోంది!

భర్తకి అన్నంపెట్టి ఎంగిళ్లూ విస్తళ్లూ ఎత్తుకుని సీతమ్మ బైటపడేసరికి పదిన్నరయింది. చీరకొంగుతో తడిచేతులు తుడుచుకుంటూ ఉస్సురుస్సురంటూ సీతమ్మవచ్చి భర్తపక్కగా నిలబడింది.

సిరా మరకలయిన అరచేతిని కుర్చీకి రాస్తూ అతను పక్కగా వచ్చి నిలబడ్డ భార్యవైపు చూశాడు.

"పగలూ, రాత్రీకూడా ఈ ఆఫీసు పనేనా" అన్నట్టుగా జాలిగా ఓమారు రాసుకునే కాగితాలవైపూ, అతనిముఖం వైపూ చూసింది సీతమ్మ.

"తెల్లవారింది మొదలు రాత్రి పదింటివరకూ నీకు వంటింటిచాకిరీ తప్పదుకదా" అన్నట్టుగా జాలిగా, బాధగా అతను చూశాడు.

"ఏంచేస్తాం! తప్పదు మరి" అన్నట్టుగా ఇద్దరూ హృదయంలో బరువంతా వ్యక్తమయ్యేటట్టుగా నిట్టూర్చి చిరునవ్వు నవ్వుకున్నారు.

"వేసంకాలం, శీతాకాలం అయితే ఎంత చాకిరీ అయినా చెయ్యొచ్చు ఏంబాధ ఉండదు. ఈ పాడువానాకాలంమాత్రం నాకు మా చెడ్డచిరాకు! అడుగుతీసి అడుగెయ్యటానికి వీల్లేకుండా మోకాళ్లలోతు బురద. కిటికీరెక్కలు తెరిస్తే వానజల్లు! మూస్తే పొగ బైటికి పోవటానికి వీలులేక కళ్లుమంటలు! ఆ కట్టెలన్నీ చెమ్మకుని మండటం లేదు...అబ్బ! నేపడే బాధ అంతా ఇంతా కాదు" — సీతమ్మ ముఖం చిట్లించి విసుగ్గా అంది.

భర్త నవ్వుకున్నాడు! సీతమ్మ మాటలకి అతను ఎప్పుడూ నవ్వుకుంటూనే ఉంటాడు! సీతమ్మ మాటలు ఎవరికైనా నవ్వొస్తాయి!

గడిచిన రోజులూ, గడవబోయేరోజులూ చాలా మంచివిగా అనుకుంటాం. అలాగే సీతమ్మ కూడా అనుకుంటూంటుంది!

"ఈ పాడు వేసంకాలం మటుకు నాకు మా చెడ్డ దుర్భరం బాబూ! ఎంతసేపూ నీడపట్టున కూర్చోవాల్సిందే! ఎడాపెడా వడగాలి! గుమ్మం దాటి అడుగు బైట పెడితే నెత్తిమాడి, కళ్లు మండుతాయి. కాళ్లు అంటుకుపోతాయి. ప్రాణం తిక్కత్తిపోతుంది! ఒళ్లంతా చెమటలు! కాకలు! అలా నిముషం పెరట్లోంచి ఇంట్లోకొచ్చేసరికి సతమతమైపోతాం"—అని సీతమ్మ గొణుక్కోవటం అతను అనేక మార్లు విన్నాడు వేసంకాలంలో.

"ఇక ఏకాలం అయినా ఫర్వాలేదుగాని ఈ శీతాకాలం మటుకు నే భరించలేనుబాబూ. ఎముకలు కొరికే చలి! అందులో నాకు అసలే చలి ఎక్కువ. తెల్లవారగానే లేవకపోతే పనులు పూర్తిగావు. లేవాలంటే మంచులాంటి చలి ఒళ్లంతా పక్షవాతం వచ్చినట్టుగా వణికి వణికి చచ్చుపడినట్టయిపోతుంది. పళ్లు టకటకా కొట్టుకుంటాయి. ఆ వణుకులో దవడలు కొరుక్కునీ, పెదిమలు కొరుక్కునీ — నానా అవస్థానూ! పాడు శీతాకాలం! ఇంకేకాలం అయినా నాకంత శ్రమలేదు"—అని సీతమ్మ గొణుక్కోవటం అనేక మార్లు విన్నాడు శీతాకాలంలో. ఇప్పుడు వింటున్నాడు వర్షాకాలం గురించి సీతమ్మ అభిప్రాయాలు.

అప్పటి మాటలు స్ఫురణకు వచ్చి నవ్వుకున్నాడు. మళ్ళీ తనపనిలో తను నిమగ్నుడైపోయాడు. సీతమ్మకి నిద్ర ముంచుకొస్తోంది! కళ్లు మూతలు పడుతున్నాయి! ఆవులింతలు వస్తున్నాయి! లేచి వెళ్లి పక్కమీద పడుకుంది. అటూ ఇటూ దొర్లింది. కొద్దికొద్దిగా కునుకుపట్టినా సరిగ్గా నిద్రపట్టడం లేదు. ఏదో లోటు! ఏమిటది?

లేచి కూర్చుని భర్త మంచం వైపుకి చూసింది. పాపాయి చలికి ముడిచి పెట్టుకుని పడుకుంది! చిన్న చిన్న ముంగురులు గాలికి అటూ ఇటూ కదులుతున్నాయి. ఒక చెయ్యి తలకింద పెట్టుకుని పడుకుంది.

పాపాయి!

అదే లోటు! పాప తనపక్కని పడుకోని రోజు తనకి నిద్రపట్టదు. పాప తనదగ్గరే పడుకోవాలి. ఇంకెవరిదగ్గరా పడుకోవటానికి వీల్లేదు.

భర్త తలవంచుకుని ఏదో రాస్తున్నాడు. సీతమ్మ మెదడు ఏవేవిటో ఆలోచిస్తోంది.

ప్రతి రాత్రీ అడపా తడపా, మోచేతి పోట్లూ, మోకాలు పోట్లూ పొడిచే పాపాయి తన పక్కని పడుకోకపోతే తనకి నిద్ర పట్టదు. అలవాటు!

సీతమ్మ లేచి పాపనెత్తుకుని తన పక్కమీద పడుకోబెట్టుకుంది. పక్కని కూర్చుని ఆప్యాయంగా 'పాపనుదురు' నిమిరింది సీతమ్మ. చేతికి బొప్పి తగిలింది. ముఖం మీదికి వంగి చూస్తే చిన్న గాయం కనబడింది. నిజంగా అక్కడ బొప్పికట్టింది.

సీతమ్మ గుండె గతుక్కుమంది గబగబా వెళ్ళి వేసలైను తీసుకొచ్చి నుదుటికి రాసింది.

ఎంత పని చేసింది తను?! తను ఎంత

పూర్తిగా ప్రవర్తించింది! తన వయస్సెంత? దాని వయస్సెంత? ఎంత వ్యత్యాసం! తనకి దానితో పంతమా? పట్టుదలా? ఛా! సిగ్గుండక్కర్లా తనకి!

పాపం! ఇవాళ్ళ ఎవరి ముఖం చూసిందో లేస్తూనే కళ్ళుమూసింది. ఎవరి ముఖం చూస్తుంది! తన ముఖమే చూసిఉంటుంది. పాడు ముఖం! మనసులో గట్టిగా లెంపలు వాయించుకుంది సీతమ్మ.

ఆమె కళ్ళు రెండూ చెమ్మగిల్లాయి. ఎంతపని చేశాను తల్లీ! పాపిష్టిదాన్ని! నా చేతులు విరిగిపోను! నే చచ్చిపోయానే తల్లీ! వెధవ కోవేశాలు! వెధవ రూపాయి నీకిస్తే ఏం పోయిందంట! అడుక్కునే పిల్లని కావాలని ఏడిపించానే తల్లీ! క్షమించమ్మా! క్షమించు! పెద్దవాళ్ళు కూడా అప్పుడప్పుడు చిన్నవాళ్ళకంటె చిన్నవాళ్ళయిపోతారు ఒక్కగానొక్క కూతుర్ని ఇలాగేనా హింసించటం! పిల్లలు లేక ఏడ్చేవాళ్ళు ఎంతమంది లేరు! పిల్లలుండి వాళ్ళని ఏడిపించే తల్లి తను. తను ఇకముందు ఇటువంటి తప్పుడు పన్లు చెయ్యకూడదు. చెయ్యనని ప్రమాణం చేస్తున్నాను. సీతమ్మ హృదయం పశ్చాత్తాపంతో నిండిపోయింది. జాలితో ఆమె అతలాకుతలమైపోయింది.

గదంతా గంభీరమైన నిశ్శబ్దం! సీతమ్మ మనసులోమటుకు పెద్ద హోరు! ఆమె ముఖం చెగువయి చెంపలన్నీ తడిసిపోయాయి! బైట అప్పుడే వెలిసిన తుఫాను, ఆమె మనసులో తిరిగి అప్పుడే ప్రారంభమయింది. చిన్న తుఫాన్!

అయినా తన కసలు బొత్తిగా ఓగిమి తక్కువ! అయినా తన కసలు ముక్కోపితనం ఎక్కువ! అందుకనే చిన్నప్పుడు తన్ని గయ్యాళి అని పిలుస్తూండేవాళ్ళు. అలా అని ఎవరో అంటే కోపం! తన అంత రాత్రే అలాగంటే తనేం చేసేది? నాలుగేళ్ళ పసిపాపని రాక్షసిలా నెట్టటమేమిటంట! తన విరగబాటు! ఇంకానయం భర్తకీ విషయం తెలియలేదు! తెలిస్తే తన అంతు తేలేదే!

పాడురూపాయి! ముష్టిరూపాయి! వెధవ రూపాయి! బోడిరూపాయి! గబగబా లేచి అలమారు తెరచింది సీతమ్మ! అలమారు రెక్కలు కిర్రుమన్నాయి! భర్త తలెత్తి తనవేపు చూశాడు! చూసి ఏమిటి సద్దుతున్నావన్నాడు! అడక్కముందే గతుక్కుమంది సీతమ్మ. గతుక్కుమన్న సీతమ్మ సద్దుకుని అబద్ధం చెప్పింది "ఏమీలేదు మెళ్ళో గొలుసు తీసి ఎందుకైనా మంచిదని దాస్తున్నాను" అని. సమాధానం అతణ్ణి నమ్మించి అతని పనిలో అతణ్ణి నిమగ్నుణ్ణి చేసింది.

అలా కొన్ని నిముషాలు మూగగా గడిచిపోయాయి!

ఉన్నట్టుండి సీతమ్మ మెదడులో మెరుపు మెరిసినట్టుగా ఓ ఆలోచన పుట్టింది. లేచి వంటగదిలోకి నడిచింది. అలమారు తీసింది. ఆరు అణాకాసులకింద మెరుస్తూన్న రూపాయి చేతిలోకి తీసుకుంది. తను చేసిన తప్పుకు సరైన ప్రాయశ్చిత్తం అదే! అలా చేస్తేనే తనమనసు శాంతిస్తుంది. ఆరూపాయి తీసుకుని మధ్యగదిలో కొచ్చింది! గడియారం పదకొండు గంటలు కొడుతూంది. బుల్లి పాపాయి బుల్లిచెయ్యి పెద్ద సీతమ్మ పెద్ద చేతిలోకి వెళ్ళింది. ఆ బుల్లి గులాబి పువ్వులాంటి అరచేతిలో రూపాయి ఉంచి గుప్పిట మూసింది! ఆ రూపాయి పాపదే! అది దాని సొత్తు! అది పారేసినా సరే, ఖర్చు చేసినా సరే, అదేమన్నా చేసుకోనీ! తనకి ప్రమేయం లేదు.

అమ్మయ్య! ఇప్పుడు మనసు శాంతించింది! గాలివాన వెలిసినట్టుగా ప్రశాంతంగా ఉంది.

భర్త లేచి పుస్తకాలు మూసి, లైటుఆర్పి వచ్చి పడుకున్నాడు. దూరంగా కుక్కలు మొరుగుతున్నాయి! కీచురాళ్ళు చెవులు హోరెత్తిస్తున్నాయి. కప్పలు బెకబెకలాడుతున్నాయి! సీతమ్మ మనస్సు తృప్తిగా ఉంది సీతమ్మ మనసులో ఏ చింతా లేదు. సీతమ్మ హాయిగా నిద్రపోయింది.

* * *

అప్పుడప్పుడే తెలతెలవారుతోంది. మబ్బు విడిచిన సూర్యుడు కొండమీంచి కరకరమంటూ తొంగి చూస్తున్నాడు. ఒడ్డున అరుస్తూ గంతులేసే కప్పలు బుడుంగుమని నీళ్ళల్లోకి దూకుతున్నాయి. కీచురాళ్ళు నోరుకట్టేశాయి! ఊరు ఊరంతా మేలుకుంది. ఉదయసంధ్యలో రకరకాల వింత వింత ధ్వనులు సమ్మేళనం పన్నెండుగంటల జాగ్రదావస్థకి నాంది ప్రస్తావన.

పెరట్లో సీతమ్మ ఊరంత గొంతుతో పాలవాడిమీద విరుచుకపడుతోంది. విరుచుకు పడటానికి కారణం రాత్రి తోడు పెట్టిన పాలు విరిగిపోవటం! మాటకి మాట తెగులు! నీటికి నాచు తెగులు! మాటమీద మాట పెరిగింది.

మాటమీద మాట పెరిగినా, తనూ అతనూ సమానంగానే తిట్టుకున్నా, పాలవాడికంటే సీతమ్మ మనసు ఎక్కువ గాయపడింది. పాలవాడికంటే సీతమ్మ ఎక్కువ పొగుపడింది! ఛీ! పాలు అమ్ముకుని బతికేవాడి చేత తను మాట పడ్డా! తన తల కొట్టేసినట్టయిపోయింది!

* * *

కిటికీలోంచి బద్ధకంగా పొగమంచును తొలుచుకుంటూ బైటపడుతూన్న పొద్దుటి ఎండ పాపాయి నుదుటిమీద పడి మెలుకువ తెప్పించింది. కళ్ళు తెరిచేసరికల్లా ఎదురుగుండా ఎదురింటి వాళ్ళ బాబ్జీ నిల్చుని ఉన్నాడు.

"అప్పుడే వచ్చావా బాబ్జీ!" అంటూ పక్కకి ఒత్తిగిలింది పాప.

బాబ్జీ జేబులోంచి ఏదో రెండు కాగితం మడతలు తీసి పాపాయి ఎడం చేతిలో పెట్టాడు.

"ఇందాకట్నించీ చూస్తున్నాను లేస్తావేమోనని ఎందుకు లేవవూ?" — బాబ్జీ ప్రశ్నించాడు.

పాపాయి ఎడం చెయ్యి గుప్పిట విప్పింది.

బాబ్జీ ఇచ్చిన కాగితప్పడవలు!

కుడి చెయ్యి గుప్పిట విప్పింది.

తళతళా మెరిసే కొత్త రూపాయి!

ఏది ముఖ్యం! ఏది అవసరం! ఏది?

బాబ్జీ ఇంత ముఖం చేసుకుని "మా దొడ్డినిండా బోలెడన్ని నీళ్ళు! మా బాబయ్యకి బోలెడన్ని పడవలు చెయ్యటం వచ్చు తెలుసా! రా ఆడుకుందాం! రా!.. రా!.." అన్నాడు దగ్గరగా వచ్చి.

పాపాయిమటుకు ఓమారు పడవకేసీ, మరోమారు రూపాయికేసీ చూస్తూ కూర్చుండిపోయింది.

"ఛీ! అదెందుకు? రూపాయి! అవతల పారెయ్యి! మనం ఇంచక్కా ఆడుకుందాం!"- అయిదేళ్ళ బాబ్జీ ముఖం చిట్లిస్తే తమాషాగా ఉంటాడు. పాపాయి వంచిన తల ఎత్తింది.

"పాపా! పాపా! ఆ రూపాయి ఇల్లా తే! ఆ వెధవ ముఖాన్ని గిరవాటెడతాను! మంచి మర్యాదా లేకుండా నానా అవాకులూ చవాకులూ కూస్తున్నాడు! ఏడి ముఖం మండా!" అంటూ సీతమ్మ గదిలో ప్రవేశించింది. ఎఱ్ఱబడి గంటు పెట్టినట్టుగా ఉన్న తల్లి ముఖంలోకి చూడకుండానే, పాపాయి చేతిలో రూపాయిని విసురుగా, నిర్లక్ష్యంగా, ఒక పనికిమాలిన వస్తువును పారేసినట్టుగా దూరంగా గిరవాటు పెట్టింది. అది దొర్లుకుంటూ వెళ్ళి సీతమ్మ పాదాల ముందు ఆగిపోయింది.

బాబ్జీ వెనకాలే కిలకిలా నవ్వుతూ, గంతుతూ చేతిలో కాగితంపడవలు జారిపోకుండా జాగ్రత్తగా పట్టుకుని పరుగు తీసింది పాపాయి!

కాగితంపడవలు!

ఆ పెరట్లో ఆ నీరు ఎంతసేపుంటుంది?!

ఆ ఆనందం పాపాయి ఎంతసేపు అనుభవిస్తుంది?!

అంతా క్షణికం!

సాయంత్రం హోరున వర్షం పడుతున్నప్పుడు సీతమ్మకి వచ్చిన కోపంలాగ...
రాత్రి నిద్రపోతున్నప్పుడు సీతమ్మ పొందిన పశ్చాత్తాపంలాగ...

తెల్లవారి గతం మరిచి వర్తమానంలోకి



## క్షణికం



ఉద్రేకాలకి లొంగిపోయిన సీతమ్మలాగ...

నిన్న సాయంత్రం హెరోరుమని వర్షం కురుస్తున్నప్పుడు పాపలో రేగిన పట్టుదల లాగ...

తెల్లవారి బాబీ చేతిలో కాగితప్పడవలు కంటపడ్డప్పుడు, పెరట్లో నిలిచిన నీరు కంట బడ్డప్పుడు, మనో నేత్రంలో చిన్ని చిన్ని అలలమధ్య ప్రయాణంచేసే కాగితం పడవలు మెదలినప్పుడు తళతళా మెరిసే రూపాయిమీద కలిగిన తేలికభావంలాగ.

అలాగే...అంతా క్షణికం! చంచలం! గాలి పడగలు! నీటిబుడగలు! కాగితప్పడవలు!

ఆ రూపాయి తీసుకెళ్లి పాలవాడి చేతిలో పడేసింది సీతమ్మ.

చేతిలో కాగితప్పడవల్ని నీళ్ళల్లో వేసింది పాపాయి!



# బాల సాహిత్యం

## చదివి తెలివిమీరె నక్క

"భాస్కరం - ప్రభాకరం"

ఆయాసం కలుగువరకు
ఆహారం మేసి నక్క
తిన్న తిండి అరుగుటకై
చిన్న "షైరు" కొట్టసాగె.

విరుగ గాచి, మిగుల ముగ్గి
వేలాడే ద్రాక్షపళ్లు!
రారమ్మని పిలిచినట్లు
నోరూరే ద్రాక్షపళ్లు!

తియ్యతియ్య ద్రాక్షపళ్లు!
తోటంతా ద్రాక్షపళ్లు!
గాలినాగి నక్క జూచి
కన్నుకొట్టె ద్రాక్షపళ్లు!!

తిండి తిన్న దొరలవలెనె
పండు తినాలనిపించగ
ఆయాసం మాట మరిచి
అందుకోగ నెగిరె నక్క!

అందినట్లె అనిపించుచు
అందకుండె ద్రాక్షపళ్లు
ఎగిరి ఎగిరి విసిగె నక్క
ఎంతసేపు ఎగురగలదు?

"కథాగేయ సుధానిధి"ని
సదా చదువుచుంట చేత
నక్క కొక్క 'ట్రిక్కు' తోచె
ప్రక్క జూచె నొక నిచ్చెన.

'నిచ్చెన బావ'ను తెచ్చెను,
నిలబెట్టెను తీగవద్ద;
నిచ్చె నెక్క; అంద లేదు;
వచ్చె నొక్క పెద్ద చిక్కు!!

తీగ మొదలు చేతబట్టి
ఊగించెను నక్కబావ
తీగ కపుడు కితకితలై
తెగ నవ్వగ మొదలుపెట్టె.

ద్రాక్షపళ్లు తీగనుండి
రాలసాగె గలగలమని
హుషారెక్కె నక్కబావ
ఊపివేసె తీగలన్ని.

ఆయాసం ఎటు బోయెనో!
అన్ని పళ్లె నారగించె
"ద్రాక్షపళ్లు పులు"పన్నది
తానుమాత్రె మన నన్నది.




సింహమొక్కటి జంతుకోటిని
సంహరించుచు చాలకాలము
ఎదురులేక నరణ్యరాజ్యము
ఏలి ముదుసలి అయ్యెను.

పారిపోయెడి జంతువులతో
పాటు పరుగెత్తుటకు చాలక
తిండికోసము కాపువేసెను
కొండగుహలో నుండియే.

వ్యాధి యేదో వచ్చి యెంతో
బాధపడుచున్నట్లు మూల్గుచు,
చేరవచ్చెడు చిన్నమృగముల
చీల్చి చంపుచునుండెను.

ఒకదినమ్మున నక్కయొక్కటి
ఉబుసుపోకకు వచ్చి యచటికి
"సింహరాజా! నమస్కారము,
సేమమా?" యని అడిగెను.

"ఏమిచెప్పుదు నక్కబావా!
ఎన్నిదినములనుండియో, నే
నొడలెరుంగక దిక్కులేనటు
లొంటరిగ పడియుంటిని.

పరామర్శముచేయగా, ఒ
క్కరుండైనను దరికిజేరడు.
జ్వరగ్రస్తుడనైన నన్నే
మరుట మీకిది ధర్మమా?

కాళ్లు కొంచెము పిసికిపోదువు
గాని యొకపరి దరికిం"మ్మని
రుద్ధకంఠముతోడ జాలిగ
వృద్ధసింహము పలికెను.

'అమ్మయో, ఈ దొంగమాటలు
నమ్మరా'దని తెలివిగల ఆ
జంబుకమ్మా చుట్టుప్రక్కల
జాగ్రతగ పరికించెను.

కొండగుహకడ సైకతస్థలి
కొన్ని గజములవరకు నున్నది.
నక్కచూడగ నచట కనబడె
పెక్కు అడుగులజాడలు.

జాడలన్నియు సింహముండిన
నీడవైపే పోవుచున్నవి.
మరలివచ్చెడు అడుగుజాడలు
మచ్చుకే నగుపించవు.

"కాళ్లు పట్టుటకన్న భాగ్యము
కలుగునా ఓ మహారాజా!
కాని చూడుడు మిమ్ము చేరెడు
కాలిజాడల చిత్రము!

కానుపింపదు జాడయొక్కటి
యైన వెనుకకు మరలువైనము.
నరకలోకపుమార్గ మిదియని
నాకు తోచుచునున్నది.

**ఈసప్ కథలు 6:**

**నండూరి రామమోహనరావు**



సేమ మరయగవచ్చు వారిని
ఏమి న్యాయము చీల్చిచంపుట?"
అనుచు జంబుక మచటినుండియె
వెనుక వెనుకకు మరలెను.

నీతి

వేయికండ్ల పరికించక
వేయరాదు ముందడుగని
ఈసప్ కథ తెలుపు నీతి
ఎన్నటికిని మరువరాదు.




## 13

బాగా బారెడు ప్రొద్దు ఎక్కినతరువాత, మార్గరెట్ నిద్ర లేచింది. పరిచారిక తెచ్చియిచ్చిన రొట్టె, పాలు ఆరగించింది.

సర్ పెర్సీ వెంట పోయినవాడు 'సుల్తాన్'ను ఇంటికి తీసుకువచ్చాడు. "ఆయన సుఖంగా ప్రయాణం చేశారేమో, కనుక్కొమ్మ"ని దాసీని పంపించింది. సర్ పెర్సీ ఇంటిదగ్గర చెప్పినట్లు, ఉత్తరమండలానికి పోనేలేదని, లండన్ పోయినాడని వార్త వచ్చింది. లండన్‌లో పెర్సీ తన నావ డేడ్రీమ్ ఎక్కి ఎక్కడికో బయలుదేరుతున్నట్లుకూడా అతడు చెప్పాడు.

ఈవార్త వినేసరికి మార్గరెట్‌కు చాలా ఆశ్చర్యం వేసింది. లండన్‌నుండి డేడ్రీమ్ ఎక్కి పెర్సీ ఎక్కడికి పోతున్నాడు? తనతో అబద్ధం చెప్పవలసిన అవసరం ఏమి వచ్చింది? అర్మండ్‌ను కాపాడటానికి తగు ఏర్పాట్లు చెయ్యటంకోసమే వెళ్తున్నట్లు పెర్సీ చెప్పినమాట గుర్తు వచ్చింది. సర్ పెర్సీకి చాలాచోట్ల పలుకుబడి గల స్నేహితులున్నారు. అందులో ఎవరి దగ్గరకో పోయి, అర్మండ్ విడుదలకు ఏర్పాట్లు చేస్తాడు కాబోలునని మనసు సరిపెట్టుకున్నది.

సుజేన్‌ను ఒకసారి తమయింటికి రమ్మని మార్గరెట్ ఆహ్వానించింది. మార్గరెట్‌కు చిన్నతనం పూర్తిగా వదలలేదు. అప్పుడప్పుడు కొంచెము చిలిపి తనం చేస్తుంటుంది. సుజేన్‌ను తమయింటికి పంపించటానికి కొంటెస్ సుతరాము ఇష్టపడదు. అందుకని గ్రెన్విల్ విందులో వేల్సు యువరాజు వింటూఉండగా మార్గరెట్ తన స్నేహితురాలిని రమ్మని పిలిచింది. వేల్సు యువరాజు అందుకొని, "అవును. సుజేన్ గనుక మార్గరెట్ ఇంటివద్ద ఉంటే, నేనూ ఒకసారి సరదాగా అక్కడికి వస్తాను." అన్నాడు. అందుచేత కొంటెస్ ఇక కాదనలేకపోయింది. విజయగర్వంతో మార్గరెట్ నవ్వుతూ, కొంటెస్‌వంక కొంటెగా చూసింది.

సుజేన్ రావటానికి ఇంకా ఆలస్యం ఉంటుంది. వస్తే ఇద్దరూ కలిసి ఖుషీగా తోటలో గంతులు వేస్తూ చిన్నపిల్లలలాగా ఆడుకోవాలని మార్గరెట్ ఆలోచన. స్కూలులో కలిసి చదువుకున్ననాటి ముచ్చటలన్నీ చెప్పుకోవచ్చు ననుకున్నది.

సుజేన్ వచ్చేదాకా ప్రొద్దుపోవటము ఎలాగో మార్గరెట్‌కు తోచలేదు. అటూ ఇటూ తోటలో తిరగసాగింది. తిరుగుతూ తనభర్త ఉపయోగించే గదులవైపుగా వెళ్ళింది.

అవి మొత్తం నాలుగు గదులు. ఒకటి పడక గది. ఇంకొకటి అలంకరణగది. మరొకటి అతిథు లెవరయినా వస్తే కూర్చోబెట్టి మాట్లాడేటందుకు ఉపయోగించేది. నాలుగవది ఒక చిన్నగది. పెర్సీ ఆ గదిలో చేరి అప్పుడప్పుడు అదీ ఇదీ చదువుకుంటూ ఉంటాడు.

ఆరోజులలోఉన్న ఫాషన్ ప్రకారం చదువుకునే గది అంటూ ఒకటి ఏర్పాటుచేసుకున్నాడేగాని పెర్సీ లాంటి మందమతి ఏమి చదువుతాడు పెద్ద? అని మార్గరెట్ అభిప్రాయం. పైగా [illegible] గది తలుపులు ఎప్పుడూ తాళంవేసి ఉంటాయి. పెర్సీగదు లన్నింటిసీ

సర్ది ఉంచే ఒక్క ఫ్రాంక్ తప్ప మరెవ్వరికీ ఆగదిలోకి ప్రవేశంలేదు. బహుశా తన రహస్యం కాస్తా బయట పడకుండా ఉండటానికి, డాబుసరిగా ఎవ్వరూ రాకుండా తాళంవేసిఉంటాడని అనుకొని మార్గరెట్ నవ్వుకుంటుంటుంది.

ఈనాడు ఎందుకో ఆగదికి తాళంవేసిలేదు. తలుపులుకూడా ఓరగా తెరిచిఉన్నాయి. అలా తీసి ఉండటం కంటబడగానే మార్గరెట్ కు ఆగదిలోకి పోయి చూసిరావాలని కొంటెకోరిక బయలుదేరింది. ఆమె గట్టిగా పోయి చూస్తానంటే, కాదని అడ్డగించేటందుకు ఫ్రాంక్ కుమాత్రం దమ్ములుంటాయా? కాని చిన్నతనం పూర్తిగా వదలని మార్గరెట్ సరాసరి పోలేదు. అటు ఇటు పొంచిచూసింది. ఫ్రాంక్ ఆ చుట్టుపక్కల లేడని రూఢి చేసుకొని, మునికాళ్లమీద నడుచుకుంటూ పోయి గదిలోపల దూరింది.

గదిలోపల దూరి చూసినతరువాత మార్గరెట్ తన అభిప్రాయం కొంతవరకు మార్చుకోవలసివచ్చింది. చదువునెపంతో పెర్సీ ఆ గదిలో చేరి బహుశా కునికిపాట్లు పడుతూఉంటాడని, అందుకోసం ప్రత్యేకం ఒక పడకకుర్చీ వేయించి ఉంటాడని మార్గరెట్ కు మొదటినుండి ఎందుకో ఒక నమ్మకం.

గది చాలా శ్రద్ధతో సర్ది ఉన్నట్లు కనిపించింది. గోడలమీద పటాలు ముచ్చటగా వ్రేలాడుతున్నాయి. అలమారులలో పుస్తకాలు క్రమంగా సర్దిఉన్నాయి. పెర్సీ ప్రొద్దునచూస్తే, చాలా హడావిడిలో బయలుదేరిపోతున్నట్లు కనిపించాడుకాని, గదిలో చూస్తే అటువంటి చిహ్నలేమీ లేవు. మార్గరెట్ చాలా కుతూహలంతో, శ్రద్ధతో గదిఅంతా పరిశీలించింది.

ఇవన్నీ చూస్తూఉంటే, పెర్సీ మందమతి అని కాని, బద్ధకస్తుడనిగాని అనుకోవటం పొరబాటనిపించింది. ఈ మందకొడితనం, ఈ వెఱ్ఱినవ్వులు, ఈ నిద్ర మత్తు, ఈ బద్ధకం అంతా ఒక నాటకంలాగా కనిపించింది. సర్వసమర్థుడైన నటుడివలె, ఒక్కరికికూడా రవ్వంతైనా అనుమానం తగలకుండా కొట్టుకు వస్తున్నాడు సర్ పెర్సీ. కాని అదే నిజమైతే, ఈ నాటకం అంతా ఎందుకు ఆడుతున్నట్లు?

గదిలో ఒకగోడమీద రెండుపటాలు ఉన్నాయి. అందులో ఒకటి పారిస్ నగరం, పరిసరాలు చూపించేది. ఇంకొకటి ఫ్రాన్స్ ఉత్తర సరిహద్దులప్రాంతం చూపించేది. ఇంత శ్రద్ధగా తీసుకువచ్చి పెర్సీ వీటిని తగిలించుకున్నాడెందుకా అనుకొని ఆశ్చర్యపోయింది మార్గరెట్. "ఏమోలెద్దూ! ఇదంతా మనకెందుకు?" అనుకుంటూ ఇవతలికి వచ్చేసింది.

వస్తూఉండగా, ఆమెకాలికి ఏదో ఒక చిన్న వస్తువు తగిలింది. డెస్కు ప్రక్కగా క్రింద తివాచీమీద పడిఉన్న ఆ వస్తువు మార్గరెట్ కాలు తగిలి, దొర్లుకుంటూపోయి అవతల పడింది.

మార్గరెట్ వంగి, దానిని పైకి తీసింది. అది ముద్రలువేయటానికి ఉపయోగించే బంగారు ఉంగరము. దానిమీద ఒకబొమ్మ చెక్కిఉన్నది. ఆ బొమ్మ చూసీ చూడటంతోనే మార్గరెట్ స్తబ్ధురాలైపోయింది.

ఆ బొమ్మ మార్గరెట్ ఎరగని దేమీ కాదు. పావలిన్ చూపించగా కాన్వెంట్ గార్డెన్ నాటకశాలలో ఒకసారి, సర్ ఆండ్రూ ఉత్తరం లాగుకొని చూసినప్పుడు గ్రెన్విల్ భవనంలో ఒకసారి ఆమె చూసినదే! అది స్కార్లెట్ పింపర్నల్ పుష్పపు బొమ్మ.

## 14

మార్గరెట్ మనస్సులో భయం ప్రవేశించింది. సందేహం కలిగింది. ఉంగరం గట్టిగా గుప్పిట్లోపట్టుకొని బయటికి పరుగెత్తుకు వచ్చింది. తోటలోనికి పోయింది. పూలమొక్కలు చాటుగా చేసుకొని ఒదిగి నిలబడింది. ఉంగరంమీద ఉన్న చెక్కడపుపనివంక తదేకదీక్షగా చూచింది.

ఇది కలా? నిజమా? ఈ ఉంగరం ఇక్కడ ఎందుకు ఉన్నది? అని ఆలోచించింది. లండన్ లో స్కార్లెట్ పింపర్నల్ పేరుమీద, గుర్తుమీద మోజు తెగబలిసిపోయిందికదా ఈమధ్యన! అందుచేతనే పెర్సీ ఈ ఉంగరం చేయించి ఉంటాడు. అని తనకు తాను సమాధానం చెప్పుకొని మనసు స్థిమితంగా ఉంచుకోవాలని ప్రయత్నించింది. కాని కొండవాగులాగా అమితవేగంతో ప్రవహించి, మనస్సును ఆక్రమించివేస్తున్న భయము ఈ సమర్థనతో తీరలేదు.

తోటలో అక్కడక్కడ కొన్ని శిల్పాకృతులున్నాయి. ఆ శిల్పాలలాగే మార్గరెట్ అక్కడ ఉండిపోయింది. తనచుట్టూ ఏమి జరుగుతున్నదో, కాలం గడుస్తున్నదో లేదో ఆమెకు తెలియటంలేదు.

"మార్గరెట్! ఎక్కడ?" అని పిలుస్తూ, సుజేన్ అక్కడకు వచ్చింది. ఒక్కదూకులో ఆమెదగ్గర చేరి

కౌగలించుకున్నది. "నీవు తోటలో ఉన్నావని చెప్పారు. అందుకని వెతుక్కుంటూ ఇలా వచ్చాను. నేను ఇవ్వాళ ఇంత పెందలకడ వస్తానని నీవు అనుకోలేదు గదూ! ఎప్పుడెప్పుడు ఇక్కడకు వచ్చిపడదామా? అని చూస్తున్నా."

మార్గరెట్ తన చేతిలో ఉన్న ఉంగరాన్ని చేతి రుమాలు మడతలలో దాచివేసింది. లేని నవ్వు, వుల్లాసం తెచ్చుకొని, "అవును. చాలా ముందుగా వచ్చావు. మరీ మంచిది. రోజంతా కులాసాగా గడపవచ్చు," అన్నది.

సుజేన్, మార్గరెట్ చేతులు చేతులు పట్టుకొని తోటలో తిరగటం మొదలుపెట్టారు. సుజేన్ అన్నది, "మాకు ఇక్కడ లండన్‌లో చాలా హాయిగానే ఉన్నది. కాని మా నాన్నగారుకూడా పారిస్‌నుండి వస్తే..."

మార్గరెట్ గుండె గతుక్కుమన్నది. స్కార్లెట్ పింపర్నల్ వెళ్లి తన తండ్రిని రక్షిస్తాడన్న ధీమాతో ఉన్న సుజేన్‌కు ప్రస్తుతపరిస్థితి తెలిస్తే, ఎంత బాధ పడుతుంది? దానికంతకీ తానే కారణమనికూడా తెలిస్తే...?

ఏదో చెప్పకుపోతూఉన్న సుజేన్ మధ్యలో ఆపి, "నేను ఊరికే కంఠశోషగా చెప్తున్నానేగాని, నీవు వినిపించుకోవటంలేదు" అని అలిగింది. మార్గరెట్ ఆలోచనలనుండి తెప్పరిల్లి, "అయితే మీ నాన్నగారి క్షేమంయినా తెలుస్తున్నాయా?" అని అడిగింది.

ఈ ప్రశ్నతో సుజేన్‌కు ఉత్సాహం ఎక్కువైంది. "మా నాన్నగారిగురించి ఇక భయంలేదు తెలుసా? స్కార్లెట్ పింపర్నల్ మా నాన్నగారికోసం బయలు దేరారుట ఈవేళ ప్రొద్దున్నే. ఈపూట లండన్ వెళ్లాడుట. సాయంత్రం అక్కడినుండి కలే పోతారు. నాలుగురోజులలో వచ్చేస్తారు. ప్రొద్దున మాయింటికి హేస్టింగ్స్ వచ్చారు. ఆయన చెప్పారు."

పిడుగులలాగా తగిలినాయి ఆమాటలు మార్గరెట్‌కు. ఇందాకటినుండి ఏవేవో అర్థంలేని సమర్థనలు చేసుకుంటూ ఆమె తన్ను తాను వంచన చేసుకుంటున్నది. ప్రొద్దున బయలుదేరటం—ఈపూట లండన్‌లో ఉండటం—సాయంత్రం కలే పోవటం. ఇంకేమరు? నిస్సందేహంగా సర్ పెర్సీయే స్కార్లెట్ పింపర్నల్!!

తన భర్తనే తాను చేతులారా షావలిన్ చేతులకు ఒప్పగించింది. ముందుగానే పెర్సీ తనతో చెప్పి ఉంటే...!

బహుశా ఈవిషయమంతా తనతో చెప్పాలనే అతడు అనుకొని ఉంటాడు. కాని మార్క్విస్ డి సెంట్ కర్ మరణశిక్షకు తానే కారణమని విన్నతరువాత చెప్పకూడదని మానివేసి ఉండాలి. అపారమైన తన ప్రతిభను ఎంత గొప్పగా దాచుకోగలిగాడు. అటు షావలిన్‌గాని, అతని అనుచరులుగాని, ఇటు తాను గాని ఒక్కరవ్వకూడా పోల్చుకోలేకపోయినారు.

గ్రెన్విల్ విందులో, భోజనశాలలో పింపర్నల్‌ను కనిపెట్టాలని, షావలిన్ ప్రయత్నించినప్పుడు, సర్ పెర్సీ అక్కడ నిద్రపోతూ కనిపించాడుట. ఆ తరువాత షావలిన్ తనతో చెప్పినదానినిబట్టిచూస్తే, అతడు రహస్యం గుర్తించినట్లు లేదు. గుర్తించలేకపోయి ఉంటే ఎంత బాగుండును?

సుజేన్ ఇంతసేపు మార్గరెట్ ముఖంవంక ఆశ్చర్యంగా చూస్తూ నిలబడిపోయింది. "ఏమైంది మార్గరెట్? ఏమిటి సంగతి?" అని ప్రశ్నించింది.

"ఏమీలేదుగాని నన్నొక నిమిషంసేపు ఆలోచించుకోనీ; చెప్తాను. పింపర్నల్ ఇవ్వాళ బయలు దేరారా?"

"అవును. ఏం? ఏదన్నా ప్రమాదం జరిగిందా? ఏమిటి, చెప్పు! నీపద్ధతిచూస్తుంటే నాకు ఎందుకో భయంగా ఉన్నది."

"భయమెందుకు సుజేన్? నేను కొంచెముసేపు ఒంటరిగా ఉండవలసిన అవసరం ఉన్నది. మరేమీ అనుకోకు. మనము మరొకనాడు కలుసుకొని మాట్లాడుకుందాము. సరేనా?" అని సుజేన్‌ను గడ్డం పట్టుకొని బతిమాలింది మార్గరెట్.

"అలాగే మార్గరెట్! ఫరవాలేదులే. మరి నేను వెళ్ళిరానా?" అంటూ సెలవుతీసుకొని వెళ్లిపోయింది సుజేన్.

సుజేన్ అలా వెళ్ళగానే, ఇటునుండి ఒక సేవకుడు వచ్చి, ఒక కవరు తెచ్చియిచ్చాడు.

"ఏమిటిది?" అని మార్గరెట్ అడిగింది.

"వార్తాహరుడొకడు లండనునుండి తెచ్చాడు"

(49-వ పేజీ చూడండి)

# ఇద్దరు యాత్రికులు

మూలం :
**లియో టాల్‌స్టాయ్.**

అనువాదం :
**మధురాంతకం రాజారాం**

ఇద్దరు వృద్ధులు కాశీయాత్ర చేసి గంగలో గ్రుంకులిడి విశ్వనాథుణ్ణి సందర్శించి రావాలనుకున్నారు. ఇద్దరిలో ఒకడేమో శ్రీమంతుడు. ఊళ్లో అతడిమాటకు తిరుగుండేది కాదు. పండుగలు పబ్బాలు, ఉత్సవాలు జాతరలు జరిగినప్పుడు అతడు ముందుండి దైవకార్యాల్ని నిర్విఘ్నంగా నెరవేర్చేవాడు. అతడి నీతి నిజాయితీపట్ల, అతడి విరోధులకైనా సందేహముండేది కాదు. ఎనిమిదిమూరల అంగవస్త్రాన్ని తలగుడ్డగా చుట్టుకుని, చేతి బెత్తాన్ని గాలిలో ఊపుకుంటూ కిరుచెప్పులు వేసుకుని తాంబూలం నములుతూ అతడు వీధిలో బయల్దేరాడంటే, అరుగులమీద కూచుని బాతాఖానీ వేస్తున్న మగవాళ్ళందరూ చెంగున క్రిందికి దిగి భయభక్తులతో నిలుచునేవారు. బిందెల్ని వేపచెట్టుక్రింద పెట్టి, కోనేరు మెట్లపైన కూచుని లోకాభిరామాయణంలో పడి, తమ సంసారాల్నే గాక యావత్ ప్రపంచాన్నీ మరచిపోయిన అమ్మలక్కలు సైతం వీధి మొగసాలలో అతడు కనబడేసరికి "అదిగో, నీలకంఠంగారొస్తున్నారు. వెళ్దాం రండి" అంటూ తొందరగా అక్కడనుంచి వెళ్ళిపోయేవారు.

నీలకంఠం భారీమనిషి. తన అరవైఏళ్ళ జీవితంలో అతడు మూల్గుతూ మూలుగుతూ మంచం మీద ముసుగుతన్నినరోజు ఒక్కటి కూడా లేదు. కాలీ విరచుకుని అతడు నడుస్తూవుంటే, గుర్రంమీన్నుంచి దిగి కాలినడకలోకి వస్తున్న సర్వసైన్యాధిపతిలా వుంటాడు. అతడు మీసాల మీద నిమ్మకాయలు నిలబెట్టి ఎప్పుడూ ప్రదర్శించలేదు గానీ, అతడలా చేయగలడని మాత్రం ఊళ్లో పుకారుండేది!

నీలకంఠంతోపాటు కాశీయాత్రకు వెళ్ళదలచుకున్న మరొక వృద్ధుడు, అతడిలా అంతపేరు ప్రతిష్ఠలు కలిగినవాడు కాదు. అతనిది అతి సామాన్యమైన కుటుంబం. ఊరిచివర పూరిగుడిసెలో అతని కాపురం. గుడిసె ప్రక్కన వేపచెట్టు క్రింద కొయ్యపనిచేస్తూ, అతడు జీవితంలో చాలాభాగం గడిపేశాడు. కుమారుడు ప్రయోజకుడై, బాధ్యత చేతబట్టుకున్న తర్వాత అతడా పనికికూడా స్వస్తి చెప్పి, ఊళ్లో అందరి కష్టసుఖాల్లోనూ పాలు పంచుకోసాగేడు. ఒకరికి జ్వరం వచ్చినా, మరొకరికి తేలుకుట్టినా, ఇంకొకరికి ఇంకొక కష్టమేదైనా వచ్చినా తక్షణం దాసుకు పిలుపు తగిలేది. దాసు వైద్యుడు గాకపోయినా, అతడి బ్రతుకంతా రోగులకు సపర్యలు చేయడంలోనే గడచిపోయిందిగాబట్టి, అతడి సలహాలు క్రొత్తవైద్యుల మందులకన్నా ఎక్కువ గుణాన్నిచ్చేవి.

దాసు ఆదినుంచీ బక్క మనిషి. వయసు యాభై దాటకపోయినా అతడి ముఖాన ముడతలు కనిపిస్తాయి. కళ్లలో వెలుగుండదు గానీ, పెదవులమీద చిరునవ్వుమాత్రం అతడిని విడిచిపెట్టదు. దాసుకీ, నిద్రాహారాలకీ అంత సంబంధముండేది కాదు. ఏ మిట్టమధ్యాహ్నమప్పుడో పళ్లు దోముకుని తిన్నగా స్నానం ముగించేవాడు. ఏ అర్ధరాత్రప్పుడో అరుగుమీద ఒరిగి, వేగుచుక్కతోనో కోడికూతతోనో లేచి 'ఏ తీరుగ నను దయజూచెదవో ఇనవంశోత్తమ రామా!' అంటూ త్యాగయ్యగారి కీర్తనతో ఇరుగుపొరుగు వాళ్ళందరికీ మేలుకొలుపులు పాడేవాడు. మూలగదుల్లో పడుకున్న అత్తగార్లు "అదిగో, దాసు కీర్తన పాడుతున్నాడు. ఇంకింకా తెల్లవారలేదూ! లేవండి, లేవండి" అని కోడళ్లని లేవగొట్టేవారు. నిజం చెప్పొద్దూ! అతడలా పాడుతుంటే ఊళ్లో కోళ్ళకు మాత్రం మహాచిరాకుగా వుండేది!

అసలు కాశీయాత్రకు బయల్దేరాలని, నీలకంఠమూ దాసూ కూడ అనుకున్న తర్వాతకూడా ఏడెనిమిదేండ్లు గడచిపోయాయి. నిజానికి నీలకంఠానికి కాశీయాత్ర చేసిరాదగినంత ఎడతెరపి చిక్కడం లే

## ★ ఇద్దరు యాత్రికులు ★

ఈ జన్మలో సాధ్యం కాదేమోనని కూడా దాసు అనుకున్నాడు. నీలకంఠానికి ఒక పని చేసి ముగించే లోపల మరొక పని కాచుకుని వుండేది. కుమారుడి పెళ్లి. అది అయిన తర్వాత కోడలికి తొలి కాన్పు ప్రసవం. ఆ పని పూర్తి కాగానే మనుమడి బారసాల. ఆ శుభకార్యం కాస్తా జరిగిపోగానే నీలకంఠానికి మరొక పెద్దపని తగిలింది. ఎప్పుడో తాతముత్తాతలు కట్టించిపోయిన పెంకుటిల్లు చాలదని దాని ప్రక్కన ఒక మేడ కట్టించడంలో అతడు నిమగ్నుడైపోయాడు.

ఒకానొక పండుగదినాన దాసు నీలకంఠం ఇంటికి వెళ్ళి అరుగుపైన కూర్చున్నాడు.

"ఏం దాసూ! చూస్తున్నావు గదూ, నా బ్రతుకంతా సంసారం గొడవలతోనే గడచిపోతోంది. ఎప్పుడు తీరిక చిక్కుతుందో, ఎప్పుడు మన యాత్ర కొనసాగుతుందో" అని నిట్టూర్పు విడిచాడు నీలకంఠం.

"పనులేమో ఎల్లకాలమూ వుంటాయి. సాకుతో మనం ఆలస్యంచేస్తూ కూచుంటే ఎలాగు? ఈ సంవత్సరం ఎండలుకూడా అమితంగా లేవు. యాత్ర చేయడానికి ఇది అనుకూలమైన కాలం" అన్నాడు దాసు.

"అవుననుకో! కానీ గోడలు కట్టడం మాత్రమే ముగిసిన ఈ మేడ గతి?" అని తన సమస్యని వెలిబుచ్చాడు నీలకంఠం.

"అదేమిటయ్యా నీలకంఠం! మీ ఇంట్లో నువ్వు తప్ప మరెవరూ లేనట్టు మాట్లాడుతావేమిటి? వాళ్లు చూచుకుంటారు."

"ఏం చూచుకుంటారో! మా వాడి సంగతి నీకు తెలియదా దాసూ! వట్టి దుబారా మనిషి. వాడికి ఇల్లు గుల్ల చేయడం తప్ప మరేమీ తెలియదు దాసూ!"

"ఎందుకు తెలియదు! మనం కళ్లు మూసుకుంటే ఆ తరువాతైనా తెలుసుకోవాలిగదా! ఇప్పటినుంచే తెలుసుకోనివ్వు మరి!"

"నిజమే, నిజమే! కానీ దాసూ, మమకారం గొప్పదికదూ! ఈ పనిమాత్రం నా చేతులమీదుగానే పూర్తికానీ. ఆతరువాత చూద్దాం"

"పూర్తయ్యే దెప్పటికి నీలకంఠం! ఈరోజు పండుగగదా! ఇల్లలకాలి, ముగ్గులు పెట్టాలి, వంట చేయాలి, పొంగళ్లున్నాయి అని ఇంట్లో తెల్లవారినుంచీ ఆడవాళ్ళది ఒకటే హడావుడి. 'ఈ పండుగ అనేది అన్నిరోజుల్లాగానే మామూలుగా వెళ్ళిపోతుందిగానీ, కొంపదీసి ఇదే శాశ్వతంగా వుండేటట్టయితే పనులు చేయలేక మన ప్రాణాలు నిలువునా ఎగిరిపోయేవేమో!' అన్నది నా కోడలు. ఆ అమ్మాయి కాస్త చదువుకున్న బాపత్తులే" అన్నాడు దాసు.

నీలకంఠం కొంతసేపు ఆలోచించాడు.

"ఐనా కాశీ యాత్రంటే వట్టి మాటల్తో అయ్యే పనా దాసూ! డబ్బు కావాలిగదా! మెల్లమెల్లగా పైకం కూడబెట్టుకోవాలి."

దాసు నవ్వాడు.

"ఇదేం తమాషా నీలకంఠం! ఊళ్లో నీకంటే డబ్బు కలిగినవాళ్లెవరున్నారు? నేను నిజానికి ఒక వేళ ఉందే అనుకో! కానీ నేను పైకం ప్రోగుచేసుకోవాలని సాకు చెప్పడం లేదు. ఎంతో కొంత డబ్బు నాదగ్గరా వుంది. లేనిపోని మాటలెందుకు? ఎప్పుడు బయల్దేరదామో చెప్పు."

"సరే, తప్పుతుందా దాసూ! వెళ్దాములే మంచి రోజు చూచుకుని" అన్నాడు నీలకంఠం.

ఆరాత్రి నీలకంఠం ఆలోచించీ, ఆలోచించీ ఒక నిర్ణయానికి వచ్చాడు. ఆమరునాటి వుదయమే అతడు దాసును కలుసుకున్నాడు.

"మనం నాలుగైదు రోజుల్లో ఖండితంగా బయల్దేరబోతున్నాం దాసూ! చావుబ్రతుకులు మన చేతుల్లో లేవు. దీప మున్నప్పుడే ఇల్లు చక్కబెట్టుకోవాలి. మన శరీరాల్లో సత్తువ చావకముందే వెళ్లి వచ్చేద్దాం."

అనుకొన్నట్టు ఆ ఇద్దరూ యాత్రకు సంసిద్ధులయ్యారు. దాసు తను చిరకాలంనుంచీ పోషించుకుంటూ వచ్చిన కొత్తైలమందని అమ్మాడు. పెరుగు, నెయ్యి అమ్మి అతడి భార్య ముంతలో దాచి వుంచిన డబ్బు అక్కరకు వచ్చింది. యాత్రా సమయంలో డబ్బుతో ఎంతో అవసరముంటుందని కోడలు అమ్మగారింటినుంచీ అప్పుడప్పుడూ తెచ్చుకున్న పైకాన్ని కూడా మామగారి ఒడిలో పోసింది. దాసు కోడల్ని ప్రేమతో చూచుకోమని భార్యని మందలించి, తల్లిపట్ల వినయ విధేయతలతో మెలగమని కొడుక్కి హితవు చెప్పి యాత్రకు బయల్దేరాడు.

నీలకంఠం ప్రయాణం మాత్రం అంత సాఫీగా ప్రారంభం కాలేదు.

కొడుకు చేతికి ఇనప్పెట్టె తాళా లిచ్చి, వడ్డీలు వసూలుచేసుకో డంలో గుట్టుమట్లని బోధించి, పొలాల్లో స్వంతంగా చేసుకోవల సిన వేవో, కౌలు కివ్వవలసినవేవో వివరించి, ఎలాగైతేనేం ఇంటిని వదల్లేక, వదల్లేక హృదయాన్ని అక్కడే వదలి, శరీరాన్ని మాత్రం ఈడ్చుకుంటూ బయల్దేరాడు.

దాసు నిశ్చింతగా ప్రయాణం సాగించాడు. అతడి మనసు దైవ చింతతో నిండిపోయింది. అతడు ప్రాపంచిక విషయాలను బొత్తిగా మరచిపోయాడు. దైవ భక్తితో తరించిపోయిన యోగుల గాథల్ని మననం చేసుకుంటూ అతడు నడువ సాగేడు.

నీలకంఠం మనసులో ఏవేవో వేదనలు అల్లిబిల్లిగా అల్లుకోసా గేయి. ఇంట్లో తన కుమారుడు తను చెప్పివచ్చినట్టు నడచుకోవడం లేదేమో! విచ్చలవిడిగా డబ్బును వెదజల్లుతున్నాడేమో! రహదారి పక్కన పొలాల్లో గిత్తల్ని అద లిస్తూ రైతులు మడక దున్నుతు న్నారు. మరి తన కుమారుడు అలా పట్టుగా పొలందగ్గరుండి సేద్యం చేయిస్తున్నాడో లేదో! అయ్యో, తను ఇంటికి తిరిగి వెళ్ళి పోతే ఎంత బాగుండును!

ఐదువారాలు గడిచిపోయాయి. త్రోవ పొడుగునా దేశం సస్య శ్యామలంగా వున్నందువల్ల, ఎక్కడ పడితే అక్కడ అన్న సత్రాల్లో బాటసారులకు భోజన సౌకర్యాలు లభిస్తున్నాయి. అదీ గాక, గృహస్థులు అతిథుల్ని, అభ్యా గతుల్ని సత్కరించడమే ఒక భాగ్యంగా తలపోసి మురిసిపోతు న్నారు. ఆతిథ్య మర్యాదల కింత పేరుమోసిన దేశంలో వుండి కూడా, ఇంతవరకూ పుణ్యక్షేత్రా లకు వెళ్లి రాకపోయినందుకు దాసు చాలా విచారించాడు.

వెలుగు ప్రక్కనే చీకటి వుంటుంది. మరికొంతదూరం పయ నించిన తర్వాత యాత్రీకు లిద్దరూ కరవు కాటకాలతో నతమతమై పోతున్న ఒక గుట్టల పుట్టల మెట్ట ప్రాంతంలో ప్రవేశించారు. అక్క డున్న వాళ్లందరూ కలమంద గడ్డల తోనూ, దేవదారు ఆకులతోనూ కాలం గడుపుకుంటున్నారు. కను చూపు మేరకూ పొలాలు ఎండి నెర్రలు పడివున్నాయి. నీళ్లకోసం వెదుక్కుంటూ కాకులు మండు టెండల్లో ఎక్కడికో ఎగిరిపోతు న్నాయి.

దుర్భిక్షదేవత వీరవిహారం చేస్తున్న ఆ ప్రదేశంలో కూడా కొందరు మానవులు ఇంకా తమ ఇళ్లనే అంటిపెట్టుకుని, పస్తులు మాడుతుండడంజూచి దాసుఆశ్చర్య పడ్డాడు. 'దానికి మనమేం చేద్దాం! అంతా వాళ్లవాళ్ల ప్రారబ్ధం' అని ఊరుకోడం నీలకంఠానికైతే చెల్లింది గానీ, దాసు అలా అనుకోలేకపో యాడు. 'ఒకవేళ చేసివుంటే ఏ ఒకరిద్దరో పాపాలుచేసివుండవచ్చు. లక్షులాంది ప్రజానీకానికి ఈ శిక్ష ఏమిటి?' అని దాసు లోలోపల విహ్వాలించిపోయాడు.

ఒకరోజు వుదయం. నీరెండలో దేశం భగ, భగలాడిపోతోంది. నీలకంఠం సూర్యుడు నడినెత్తిమీదికి వచ్చేసరికి దాపునవున్న బస్తీకి చేరుకోవాలన్న పట్టుదలతో నడు స్తున్నాడు. దాసు వెనుకపడ్డాడు. అతనికి మొదటినుంచీ నస్యం వేసే దురలవాటొకటుంది. డబ్బీలో నస్యం ఖాళీగావడం మూలాన అత నిలో ఉత్సాహం క్రమేపీ సన్నగిల్లి పోసాగింది. అందుకుతోడూ, నాలుక పిడచ గట్టుకునిపోయి, గుక్కెడు మంచినీళ్లు గొంతుక వెంట దిగజారకపోతే శోష తగు ల్తుందేమోనన్న భయం కూడా అతనికి కలుగజొచ్చింది.

నీలకంఠం వెనుదిరిగి చూచి "అబ్బే, ఏమిటిది దాసూ! ఇలా గైతే మనం కాశీ చేరుకోడం కల లోని మాట! ఐనా అదేం నడ వడం! నువ్వు చీమల్తో పందెం వేస్తు న్నావులా వుంది" అన్నాడు.

"నీళ్ళు త్రాగాలి నీలకంఠం! మంచినీళ్ళు" అన్నాడు దాసు.

"అదిగో, అక్కడేదో ఊరున్న ట్టుంది. త్రాగిరా. నే నా చెట్టు క్రింద వుంటాను" అన్నాడు నీల కంఠం.

"ఎందుకులే నీలకంఠం! నువ్వు మెల్లగా నడుస్తూ వుండు. నేను నిన్ను కలుసుకుంటాను" అన్నాడు దాసు.

నీలకంఠం రస్తావెంబడి నడువ సాగేడు. దాసు కాలిబాటలోబడి చింతచెట్ల మధ్య కనిపిస్తున్న పల్లె టూరికి దారితీశాడు.

పది తాటాకు కొంపలు మాత్రమే బిక్కుబిక్కుమంటున్న ఆ పల్లెలో రచ్చబండదగ్గర నిలబడి దాసు వీథంతా కలయజూచాడు. మచ్చుకైనా ఒక మనిషి కనిపిం చడం లేదు. కొట్టాల్లో గొడ్లు లేవు. ఇళ్ళల్లో కూడా మనుషులున్న సవ్వడి వినిపించడంలేదు. దాసు మెల్లగా ఒక గుడిసెదగ్గరికి వెళ్లాడు.

గడ్డికోత

ఫొటో: పి. వి. ధర్మారెడ్డి, కర్నూలు.



# ఇద్దరు యాత్రికులు



మూసివున్న తలుపును లోపలికి తోశాడు. లోపల గడియ లేదు. తలుపు కిర్రుమని శబ్దంచేస్తూ తెరుచుకుంది. దాసు రెండడుగులు ముందుకు వేశాడు.

ఆ ఇంట్లో ఎక్కడి సామాను అక్కడ చిందరవందరగా పడివున్నాయి. ఒకమూల కుక్కిమంచంపైన ముసలావిడ ఒకతె ఉబ్బసంతో కొలిమితిత్తిలా బుసలు కొడుతూ పడుకునివుంది. మంచంకోడుదగ్గర రెండేళ్ల కుర్రాడు ఏడవడానికి శక్తి లేకపోయినా, ఏడవడం తప్ప మరి చేయగలిగింది లేక వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు.

"అమ్మా!" అని దాసు పలకరించాడు. ముసలావిడ కళ్లు తెరచి "ఎవరు నువ్వు? ఏం కావాలి? ఇక్కడేమీ దొరకదు. వెళ్లు, వెళ్లు" అని మళ్ళీ కళ్ళు మూసుకుంది.

"నాకేమీ వద్దమ్మా! మంచి నీళ్ళు కావాలి" అన్నాడు దాసు.

"మంచినీళ్ళా! ఎక్కడున్నాయి! గిందె బుజాన పెట్టుకుని ఒక గడియ సేపు నడిస్తే బావిదగ్గరికి పోవచ్చు. ఒక్క ఝామునే ఒక్కడుండి ఊరనిచ్చి, చేదుకుంటే ఒక దుత్తెడు నీళ్లు దొరుకుతాయ్. ఆ నీళ్ళకోసం నీకంటే ముందుగా వెళ్ళిన వాళ్లు యాభైఆరుమంది అక్కడ పడిగాపులు పడివుంటారు. ఎవర్ని పొమ్మంటావ్! ఎలా తెమ్మంటావ్! అలా పెరటివైపుకు వెళ్ళి చూడు. ఎండిపోయిన సొరపందిరి క్రింద అబ్బాయి పడివున్నాడు. వాడు బాగున్నంతవరకూ మమ్మల్ని ఏలాగోలాగు కాపాడుకొచ్చాడు. వాడు పడిపోయాడు. వాడికంటే ముందు మేము పడిపోయాము. ఇంకేముంది? అంతా అయిపోయింది!" ఒగర్పు అధికంకావడంవల్ల ముసలావిడ మరి మాట్లాడ లేకపోయింది.

దాసు పెరట్లోకి వెళ్లాడు. ముసలావిడ చెప్పినట్టు అక్కడ ఎండి

పోయిన మల్లెపందిరిక్రింద ముప్ఫయి యేళ్ళయువకు డొకడు చొంగలు కార్చుకుంటూ పడివున్నాడు.

"దాసు అతడిదగ్గర కూర్చుని "బాబూ! కళ్లుతెరు! ఇంట్లో పడుకో గూడదూ!" అన్నాడు.

యువకుడు కళ్లుదెరచి ఎదుట వున్న మనిషెవరో తెలియక "ఎవరూ? ఏమంటున్నారు?" అన్నాడు.

"నేనెవరినైతేనేం లే బాబూ! నీకు ఒళ్లు జబ్బుచేసి ఎన్నిరోజులయింది? మందు తీసుకోగూడదూ?" అన్నాడు దాసు.

"మందిచ్చేవాళ్లెవరున్నారు? పది రోజులనుంచీ జ్వరం కాస్తూనేవుంది. నేనిక్కడపడిపోయింది నిన్ననో మొన్ననో సరిగ్గా జ్ఞాపకంలేదు" అన్నాడు యువకుడు.

దాసు మెల్లిగా అతణ్ణి లేవదీసుకెళ్లి ఇంట్లో పండబెట్టాడు. దుత్త, త్రాడు పట్టుకెళ్ళి నీళ్లు తోడి తెచ్చాడు. అప్పటికే మధ్యాహ్నం దాటింది. తనవెంట దెచ్చుకున్న మూటలోనుంచీ రొట్టె ముక్కలు పైకితీసి ముసలావిడకు తినిపించాడు. రొట్టెల్నిచూడగానే కుర్రాడికి ప్రాణం లేచి వచ్చినట్లయింది. జ్వరంతో బాధపడుతున్న యువకుడుమాత్రం ఆ రొట్టెనుకూడా నమిలి తినలేకపోయాడు. దాసు పొరుగూరికి వెళ్లి అంగడిలో బియ్యము, నూకలు కొనితెచ్చి మొదట నూకలతో గంజికాచాడు. వేడిగా రెండు గ్రుక్కలగంజి గొంతుకవెంట దిగజారగానే ఆ యువకుడిముఖంలోకూడా ఇంచుక జీవకళ తారాడసాగింది. రొట్టెల్ని తిన్నతర్వాత కుర్రాడు ఏడుపు మాని నిద్రపోయాడు. ప్రొద్దు పడమటి కొండమాటున మాటుమణిగే సరికి ముసలావిడకుకూడా ఉబ్బసం కొంత తగ్గింది.

"నువ్వెవరివో మాకు తెలియదు. దేవుడే నిన్ను మాదగ్గరికి పంపించినట్టున్నాడు. నువ్వు గనుక ఈరోజు ఆదుకోకపోయివుంటే ఈపాటికి మేమిలావుండేవాళ్లంకాము. నీ బిడ్డలు చల్లగా వుండాలి! నువ్వు నూరేండ్లపాటు బ్రతకాలి" అని ముసలావిడ గోడకు చేరగిలబడి దాసుపైన దీవనలు కురిపించసాగింది.

"మనుష్యులమై పుట్టినతర్వాత ఒకాళ్ళకొకరు సాయంచేసుకోకుంటే ఎలాగమ్మా! అదలా వుండనీగానీ ఈ కుర్రాడితల్లి ఏమైంది" అని ప్రశ్నించాడు దాసు.

దాసు తీగెనుమాత్రమే కదిపాడు. దానితో డొంకంతా కదిలింది.

అది బాగా బ్రతికి, చెడి చితికిపోయిన కుటుంబం. ఆ ముసలావిడ పేరు సీతమ్మ. సీతమ్మకు నలుగురు కొడుకు లుండేవారు. అందులో ఇద్దరు దండుకు వెళ్ళి తిరిగిరాలేదు. ఒకణ్ణి నాలుగేళ్లకు ముందు వచ్చిన మహమ్మారి తనవెంట దీసుకెళ్లింది. నాలుగు స్తంభాల మేడలో మూడు స్తంభాలు విరిగిపోయాయి. ఒకటి మాత్రం మిగిలింది. ఆ ఒకడికి సీతమ్మ తన మేనకోడల్ని తెచ్చి పెళ్ళిచేసింది. 'కామమ్మ రాగానే కరువొచ్చినాది' అన్నట్టు కోడలు ఇంట్లో కాలుబెట్టిన సంవత్సరమే వానల్లేక, చెరువులెండి బావులు అట్టడుగున పచ్చిక మొలిచింది. తరువాత వరుసగా ఆరేళ్లు కరువు. కరువులోనే కోడలు కడుపున కాయ గాచింది. కుర్రాడికి పురుడు దీరకముందే తల్లికి జన్నితగిలి, ఇంట్లో పుట్టెడు దుఃఖాన్ని నిలిపి పరలోకం చేరుకుంది. కోడలు చావుతో ఇల్లు వల్లకాడులా తయారై కూచుంది. అప్పటినుంచీ ఉబ్బసం ఎక్కువై సీతమ్మ మంచం పట్టింది. అక్కడా, ఇక్కడా కూలీ నాలీ చేసి తెచ్చే డబ్బులతో బ్రతుకుసాగక, వేళకు సరిగ్గా తిండిలేక ఆమె కొడుకు కృంగి కృశించిపోయాడు. అతనికి జ్వరం రావడంతో పరిస్థితి మరింత విషమించింది. ఇరుగుపొరుగున వున్న వాళ్ల జీవనంకూడా యిందుకు నకలుగానే వున్నందువల్ల పైనుంచి ఎలాంటి సహాయమూ లభించడానికి ఆస్కారం లేకపోయింది.

బరువెక్కిన హృదయంతో దాసు [illegible] దుఃఖగాథ విన్నాడు. వింటూ తన కాశీయాత్ర మార్గమధ్యంలోనే ఆగిపోయిందన్న విషయాన్ని తాత్కాలికంగా మరచిపోయాడు. ఈ కుటుంబం ఎలా గట్టెక్కుతుంది? [illegible] అబ్బాయికి జబ్బు నయం గాకపోతే [illegible] కుర్రాడి గతేమిటి? ఈ ప్రశ్నలకు జవాబు చెప్పకోలేక దాసు తల్లడిల్లిపోయాడు.

ఆమరునాటి వుదయం దాసు పొరుగూరికి వెళ్ళి జ్వరం నయమైనట్టయితే ముప్ఫయి రూపాయలిచ్చే షరతుతో వైద్యుణ్ణి తీసుకొచ్చాడు. వైద్యుడు మందిచ్చి రోగికి పాలు పండ్లు తప్ప మరేదీ యివ్వగూడదని పథ్యం పెట్టాడు. పండ్లకోసం దాసు బస్తీకి వెళ్ళి వచ్చాడు. వారం రోజుల్లో ఆ యువకుడు తేరుకొని, లేచి నడవసాగేడు. ముసలావిడ వేళకు పట్టెడన్నం తిని వంటా వార్పు చేసుకోసాగింది.

దాసుకు స్వవిషయం ఆలోచించుకోడానికి తీరిక చిక్కింది. నీల

#  ఇద్దరు యాత్రికులు 

కంఠం ఈపాటికి చాలాదూరం వెళ్ళివుంటాడు. ఇక తను అతణ్ణి మార్గంలో కలుసుకోడం సాధ్యపడదు. తెచ్చుకున్న డబ్బులో ముప్పాతిక వంతు వైద్యుడి క్రింద, మిగతా ఖర్చుల క్రింద దఖలు పడిపోయింది. ఇంక తనేం చేయాలి? ఊరికి తిరిగి వెళ్ళిపోవడం కన్నా గత్యంతరం ఏముంది?

"ఓరి నిర్భాగ్యుడా, దాసూ! ఈ జన్మలో నీకు విశ్వేశ్వరుణ్ణి సందర్శించుకునే భాగ్యం లేదు! నువ్వదృష్టహీనుడివి! ఏం చేస్తావు మరి? తిరిగి వెళ్ళిపో" అని దాసు తనలో తానే అనుకున్నాడు.

ఆ ఏడెనిమిది రోజుల్లో దాసుకు ఆ కుటుంబంతో త్రెంపరాని ఆత్మీయత ఏర్పడింది. దాన్ని ఛేధించుకుని ఆవల పడడం ఎలాగని అతడు ఆలోచించాడు. వాళ్లు తనని వెళ్ళనివ్వరు. తనింక అక్కడుండి వాళ్ళకు చేయగలిగే మేలేమీ వుండదు. తెలియకుండా వెళ్ళిపోవడమే మంచిది. ఈ నిర్ణయానికి వచ్చినదాసు ఒక అర్ధరాత్రివేళ అందరూ నిద్రపోతున్నప్పుడు మెల్లగా తలుపుతీసుకుని ఈవలికి వచ్చి స్వగ్రామాభిముఖుడై నడువ సాగేడు.

ఒంటరిగా మరలివచ్చిన దాసుని చూచి ఊళ్లో అందరూ విస్తుపోయారు. "నీలకంఠం రాలేదేం! ఏమయ్యాడు?" అని ప్రశ్నించారు.

"మార్గమధ్యంలో మేము విడిపోయాం. నీలకంఠం ఈపాటికి కాశీనగరం చేరుకునివుంటాడు. అనుకోని ఖర్చులు కొన్ని తగలడంవల్ల నా డబ్బు సగందూరం వెళ్లేసరికే అయిపోయింది. అందుచేత ప్రస్తుతానికి యాత్ర మానుకుని తిరిగి వచ్చేశాను." అన్నాడు దాసు.

* * * *

దాహశాంతికోసం దాసు రహదారి ప్రక్కనవున్న పల్లెటూరికి వెళ్లినరోజున నీలకంఠం సాయంత్రం వరకూ అతడికోసం ఎదురు చూచాడు. ఎంతకూ దాసువచ్చి అతణ్ణి కలుసుకోలేదు. ఆరాత్రి నీలకంఠం ఆ ప్రాంతంలోవున్న బస్తీలోఆగి, తెల్లవారగానే లేచి దాసు తన వెనుకనేవచ్చి ఎక్కడైనా వేచివున్నాడేమోనని ఊరంతా వెదికాడు. కొందరు బాటసారుల్ని వాకబుచేశాడు. దాసుజాడ చెప్పినవాళ్లొక్కరూ లేరు. ఒకవేళ దాసు మరొకదారిగుండా ముందుకు సాగిపోయాడేమోనని నీలకంఠానికి ఒక సందేహం కలిగింది. "ఎలా పయనించినా గమ్యస్థానమొకటేగదా! అక్కడైనాకలుసుకోకపోతామా?" అనుకుని అతడు ఒక యాత్రీకుల జట్టుతో కలసి మళ్ళీ ప్రయాణం చేయసాగేడు.

రెండు వారాలు పయనించిన తర్వాత ఆ యాత్రీకులందరూ కాశీనగరం చేరుకున్నారు. సర్వపాపాల్ని నివారించే గంగానదిలో మణికర్ణిక, పంచగంగ, వరుణ, కేదార మొదలైన స్నానఘట్టాల్లో గ్రుంకులిడి ప్రయాణశ్రమను తీర్చుకున్నారు.

విశ్వనాథునిఆలయాన్ని మూడుమార్లు ప్రదక్షిణంతిరిగి, జట్లుజట్లుగా గర్భగుడిలో ప్రవేశించారు. వేయిదివ్వెల వెలుగులో విశ్వనాథుని లింగమూర్తి కనులవిందుగా వాళ్లకు ప్రత్యక్షమైంది.

నీలకంఠం ఎంతో ప్రయత్నించాడుగానీ జనాన్ని తోసుకుని మరీ ముందుకు పోలేకపోయాడు. కొంతదూరంలోనే నిలబడి విశ్వేశ్వరుణ్ణి దర్శించి, తనయాత్ర సఫలమైనందుకు కలిగిన ఆనందాతిరేకం చేత మేను మరచిపోయాడు. 'ఈ సమయంలో దాసుకూడా యిక్కడ వుంటే ఎంత బాగుండేది! అతడు దురదృష్టవంతుడు. పుణ్యం చేసి పుట్టినవాళ్లకిమాత్రమే విశ్వనాథుని దర్శనం దొరుకుతుంది' అనుకున్నాడు. అతడలా అనుకుంటూ వుండగానే ఒక విచిత్రం జరిగింది. నీలకంఠం తనకళ్ళను తానే నమ్మలేకపోయాడు. ఇది కలగాదుగదా అని కళ్ళు నులుముకున్నాడు. అది కలగాదు, యథార్థమే! మూలవిరాట్టుకు చేరువగా, వేదవిహితంగా ధూపదీపహారతుల్ని జరుపుతున్న అర్చకులకంటే దగ్గరగా దాసు నిలబడివున్నాడు!

నీలకంఠం గొంతెత్తి దాసుని పిలువబోయాడు. కాని గొంతు పెకల్లేదు. దాసు ఎప్పుడు వచ్చినట్టు? తనకంటే ముందుగా ఎలా రాగలిగాడు? ఎలాగో వచ్చాడని సరిపెట్టుకున్నప్పటికీ, తనకూ విశ్వేశ్వరుడికి ఏ జన్మాంతర సంబంధమో వున్నట్టు అంత చేరువగా ఎలా నిలబడగలిగాడు?

నీలకంఠం యాత్రీకులతో బాటు

బయటికి వచ్చి, ఆలయ ప్రాంగణంలో దాసు రాకకోసం ఎదురు చూశాడు. ప్రొద్దుపోయింది. సంధ్యాసమయాన జరుగవలసిన పూజలన్నీ యథావిధిగా జరిగిపోయాయి. అర్చకులు బయటికి వచ్చి తలుపులు మూసివేశారు. కానీ దాసు మాత్రం బయటికి రాలేదు.

నీలకంఠం పది రోజులపాటు కాశిలో వుండిపోయాడు. అన్నపూర్ణ అన్న పేరుతో విఖ్యాతికెక్కిన విశాలాక్షిని, సాక్షీ వినాయకుణ్ణి దర్శించాడు. గంగాజలాన్ని ఒకపాత్రలో పదిలపరచుకున్నాడు. యాత్రికులతో కలిసి స్వగ్రామానికి బయల్దేరాడు.

మార్గమధ్యంలో తనూ, దాసు విడిపోయిన చోట ఆగి, ఆ పల్లెటూరికి వెళ్ళి నీలకంఠం దాసునిగురించి వాకబు చేశాడు. సీతమ్మద్వారా కొంత విషయం తెలిసింది. "అతడొక రోజు వుదయం వచ్చాడు. రెండు వారాలపాటు మా యింట్లో వుండి కష్టసమయంలో మాకు సాయపడ్డాడు. తరువాత అతడెలా వచ్చాడో, అలాగే వెళ్ళిపోయాడు. అతడు మనిషి కాడు బాబూ! మనిషైతే అతడికి మాపైన అంత నెనరెందుకుంటుంది? మనిషైతే వెళ్ళేప్పుడు ఒకమాటైనా చెప్పిపోడా! ఒక అర్థరాత్రివేళ ఉన్నట్టుండి మాయమైపోయాడు." సీతమ్మ యింతకన్నా మరేం చెప్పలేకపోయింది.

నీలకంఠం నాలుగైదు వారాలు పయనించి ఊరు చేరుకున్నాడు. చేరుకోగానే దాసు అప్పటికి రెండు మూడు నెలలకు ముందే తిరిగివచ్చేశాడన్న వార్త తెలిసింది. నీలకంఠం సరాసరి దాసు యింటికి వెళ్లాడు.

దాసు ఆనందంతో నీలకంఠాన్ని కౌగలించుకున్నాడు. "నేను పాపాత్ముణ్ణి నీలకంఠం! భగవంతుణ్ణి సందర్శించుకోలేకపోయాను" అని వాపోయాడు.

నీలకంఠం దాసు చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని "నువ్వలా అనకూడదు దాసూ! భగవంతుడి అనుగ్రహానికి పాత్రుడైనవాడివి నువ్వు! నేను కాశికి వెళ్ళి విశ్వనాథుణ్ణి దర్శించాననుకో! కానీ అప్పుడు కూడా నా హృదయం ఇక్కడే వుంది. నువ్విక్కడున్నప్పటికీ నీ హృదయం భగవంతుడికి చేరువగానే వుంటుంది. ఇన్ని మాటలెందుకు దాసూ! నేను నిన్ను స్వామి సన్నిధిలో చూశాను. నువ్వు..."

దాసు అతణ్ణి మాట్లాడనీయకుండా "అంతా అతడి అనుగ్రహం నీలకంఠం! మనదేముంది" అని ఆ ప్రసంగాన్నంతటితో ఆపేశాడు.

"నువ్వు కొద్ది రోజులపాటుండి వచ్చిన పల్లెటూళ్లో, నువ్వేమైనావని అడిగి తెలుసుకోడానికి వెళ్లాను. వాళ్లకు నువ్వు చేసిన..."

"మనం చేసేదేముంది నీలకంఠం! చేయించేవాడు పైన వున్నాడు. నువ్వు బాగా అలసిపోయినట్టున్నావు. ఇంట్లో పాలుందేమో చూస్తానుండు" అంటూ దాసు లోపలికి వెళ్లాడు.

నీలకంఠం నిట్టూర్పు విడిచాడు. ప్రేమార్ద్రమైన హృదయంతో తోడి మానవులకు సాయపడడం కన్నా మానవుడు చేయవలసిన ఘనకార్యం మరొకటి లేదనీ, కోటి పుణ్యక్షేత్రాలకు తిరిగి రావడం కన్నా నిస్వార్థంగా దీనమానవులకు సేవచేయడం ద్వారా అతడు భగవంతుని అనుగ్రహానికి పాత్రుడు కాగలడని నీలకంఠానికి అవగతమైంది. 

## ద్వితీయము

(12-వ పేజీ తరువాయి)

గదిలో మధు...బావ కీదుఃఖమునుండి విమోచన లేదా!...వుంది! బావ సామీప్యములో ఆవిధముగా చూసేటప్పటికి...తరణోపాయము తట్టింది. రెండు నెలలనుంచి ఆమెని వేధిస్తున్న ప్రశ్నకి సమాధానము దొరికింది. తన కర్తవ్యము తెలిసింది.

వెనకాల దల్లని చెయ్యి తగిలేటప్పటికి శ్రీమన్నారాయణ "విమలా వచ్చావా?" అంటూ కళ్లు తెరిచాడు. "నేను రాజీని" అంది. "నువ్వా రాజీ! అప్పుడే ఓకల... అందులో విమల కన్పించింది. యింకా నువ్వు నిద్రపోలేదా!"

"నా నిద్రకేం వచ్చె... యింత చలిలో యిల్లా పడుకుంటే ఆరోగ్యమేమన్నా వుంటాలా. చూడండి బట్టలు ఎల్లా తడిసిపోయాయో అంది రాజేశ్వరి.

"లేదు రాజీ!..."

"ఏమిటి లేదు...మధు కన్యాయము చేస్తారా?" అంది రాజేశ్వరి బలవంతాన వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ.

ఏం చెయ్యమంటావు?...రాజీ రేపటినుంచి నన్నిల్లా ప్రశ్నించేవారు ఎవరు?... నేను రేపటినుంచి ఎవరికోసము బ్రతకాలి..

"బావగారూ!..ఆనాడు మా అక్కయ్య కోరిక నిరాకరించవద్దుఅని అభ్యర్థించడానికి వచ్చాను...యీనాడు మరో కోరిక కోరడానికి వచ్చాను... ప్రసాదిస్తారా?" అంది రాజేశ్వరి...

"ఏమిటది రాజీ!" అన్నాడు శ్రీమన్నారాయణ.

"ఏం లేదు..." ఆమె కంఠము బొంగురుపడింది...నాకు నాకు మా అక్కయ్యకి యిచ్చినస్థానము యివ్వరూ" అంది.

"ఏమిటి రాజీ నువ్వనేది?" అన్నాడు శ్రీమన్నారాయణ అతి ఆశ్చర్యంగా.

"అవును...అప్పుడు మీరు మధుని విడిచి వుండనక్కర్లేదు. యీ విధముగా మీ అంధకారము కొంతవరకైనా తగ్గితే అంతకంటె నాకొక్కావల్సిందేమిటి?...అంది రాజేశ్వరి తలవంచుకుని.

"రాజీ!..."

"బావా!"

"నువ్వు నిజముగా దేవతవి...యీ నిర్భాగ్యుని మీద అంత దయ ఏనికి?" అన్నాడు ఆమెని దగ్గరకు తీసుకుంటూ శ్రీమన్నారాయణ. 

# స్కార్లెట్ పింపర్నల్

(40 వ పేజీ తరువాయి)

"ఎవరిచ్చారుట?"

"ఈ కవరు చూస్తే అంతా మీాకే తెలుస్తుందని చెప్పాడు."

"ఉన్నాడా వెళ్లాడా కవరుతెచ్చినవాడు. ఉంటే ఇలా పంపించు ఒకసారి." అన్నది.

అది ఆర్మండ్ సెంట్ జస్ట్ సర్ ఆండ్రూకు వ్రాసిన ఉత్తరం. మార్గరెట్ కంఠంమీాదికి కత్తిడి తేవటానికి షావలిన్‌కు ఉపయోగించుకున్నది. షావలిన్ ఇప్పుడిది పంపించాడంటే, అతనికి స్కార్లెట్ పింపర్నల్ కెలే పోతూ తారసపడ్డాడన్నమాట!

వార్తాహరుడు వచ్చాడు.

"నీకు ఈ ఉత్తరం ఇచ్చినది ఎవరు?" అని ప్రశ్నించింది మార్గరెట్.

"ఎవరో ఒక పెద్దమనుష్యుడు లండన్‌లోని ఒక హోటలువద్ద ఉన్నాడు. ఈ ఉత్తరం మీాకు అందజెయ్యమని, సర్వం మీాకే తెలుస్తుందని చెప్పారు."

"ఆయన ఇంకా అక్కడే ఉన్నారా?"

"లేదు. అక్కడినుండి డోవరు వెళ్లాలని ప్రయాణమౌతున్నారు."

"సరే పో!"

కాళ్లక్రింద నేల బీటలువారిపోతున్నట్లు అనిపించింది మార్గరెట్‌కు. ఇప్పుడేమి చెయ్యాలి? ఎలాగైనా పోయి పెర్సీని కలుసుకొని, ఉన్న పరిస్థితి అంతా విశదంగా చెప్పాలి. అంతకన్న గత్యంతరం లేదు.

"నా కోచి ప్రయాణానికి సిద్ధంచెయ్యండి ఉన్నవాటిలో కెల్లా బాగా పరుగెత్తే గుఱ్ఱాలను కట్టండి." అని సేవకులకు ఆజ్ఞాపించింది.

తన ఒక్కరితవలన ఈ పని అంతా ఏమవుతుంది! ఇంకా ఎవరిసహాయమైనా ఉంటే బాగుండును. పెర్సీ బయలుదేరి ముందు పోయినాడు. షావలిన్ కూడా ఈ సాయంత్రానికో బయలుదేరుతాడు. తానుకూడా ఫ్రాన్సు బయలుదేరాలి! తనకు షావలిన్‌కు ఇప్పుడు పోటీ. ఎవరు ముందు చేరగలరో!

## 15

మరొక అరగంటసేపటిలో మార్గరెట్ కోచి ఉరుకులు పరుగులుగా రిచ్‌మండ్ నుండి లండను బయలుదేరిపోతున్నది. పింపర్నల్ సమితిలో సభ్యులు చాలామంది ఉన్నా, సహాయ మర్థించటానికి తగినవాడు సర్ ఆండ్రూయేనని ఆమెకు తోచింది. సుజేన్, ఆండ్రూ పరస్పరం ప్రేమించుకొనిఉండటంచేత, అతడు తనకు చాలా ఆప్తుడని ఆమె భావించింది.

ఒకవేళ సర్ ఆండ్రూకూడా పెర్సీతోపాటుగా ఫ్రాన్సు వెళ్ళాడేమొ! అప్పుడు లార్డ్ హేస్టింగ్స్‌నుగాని, లార్డ్‌టోనీనిగాని పిలవవచ్చు ననుకున్నది మార్గరెట్. అదృష్టవశాత్తు సర్ ఆండ్రూ ఇంటివద్దనే దొరికాడు.

మార్గరెట్ బ్లాకెనీ తనకోసం వచ్చిందన్న సంగతి వినీవినటంతోనే అతడు నిర్విణ్ణుడైనాడు. పింపర్నల్ ఆ ప్రొద్దుటిపూటనే కెలే వెళ్లాడు. ఇటువంటి తరుణంలో తాను ఆ క్రొంచిదానిని నమ్మి కనిపిస్తే ఏమో, కనిపించకపోతే ఏమో అని సందేహంలో పడ్డాడు ఆండ్రూ. చివరకు ఎలాగైతేనేమి, కనిపించకపోవటం బాగుండదని హాలులోకి వచ్చి, ఆమెను పలకరించి, కుర్చీ చూపించాడు.

కుర్చీలో కూర్చుంటూ, ఆదుర్దా ఎంతమాత్రం చూపించకుండా, శాంతంగా మాట్లాడటం ఆరంభించింది మార్గరెట్.

"సర్ ఆండ్రూ! ఇప్పుడు కబుర్లకు ఏమీా వ్యవధానంలేదు. నేను చెప్పేమాటలు విను. నన్ను విశ్వసించు. చాలా ముఖ్యమైన విషయం ఒకటి మాట్లాడాలని వచ్చాను. మీా నాయకుడు - మీా ప్రియస్నేహితుడు అయిన స్కార్లెట్ పింపర్నల్ నెత్తిమీాద పిడుగుపడటానికి సిద్ధంగా ఉన్నది. నా భర్త, సర్ పెర్సీ ప్రమాదంలో చిక్కుకున్నాడు."

అనలే ఆమెపయిన ఆండ్రూకు నమ్మకం కుదరలేదు. అనుకోకుండా హఠాత్తుగా ఆమె ఈ రహస్యం తెలిసినట్లు మాట్లాడటంతో, ఆమెను బుకాయించాలో, కూడదో తోచక తికమకపడ్డాడు.

"నాకు ఈ రహస్యం ఎట్లా తెలిసిందా అని ఆశ్చర్యపడుతున్నావా? ఎలాగో తెలిసింది. అదంతా తరువాత మాట్లాడుకుందాం. నాకే కాదు ఈ సంగతి షావలిన్‌కు కూడా తెలిసింది. ఇప్పటికయినా మనము పెర్సీని రక్షించుకునే అవకాశం మించిపోలేదు. నా ఒక్కదీవలన ఏమవుతుంది చెప్పు! నివు సహాయంచేయావి సర్ ఆండ్రూ?" అని మార్గరెట్ ప్రాధేయపడింది.

ఏమీా మాట్లాడకుండా ఉంటే బొత్తిగా బాగుండదని ఆండ్రూ "అది కాదు లేడీ బ్లాకెనీ! నేను..." అని

ఆరంభించాడు.

"నేను చెప్పేది విను ముందు." అన్నది మార్గరెట్. "ఉన్న సంగతి యిది. షావలిన్ డోవరు హోటలులో మీవద్ద కొన్ని కాగితాలు సంపాదించాడా? వాటినిబట్టి కౌంట్ డి టూర్నే మొదలయినవారిని రక్షించటానికి మీరు వేసుకున్న పథకమంతా అతడు ఆకళింపు చేసుకున్నాడు. సర్ పెర్సీ అనుకున్న ప్రకారం బయలుదేరివెళ్ళారు. పింపర్నల్ ఎవరో షావలిన్‌కు బాగా తెలుసు."

"నాకు ఏమీ బోధపడటంలేదు." అని నసిగాడు ఆండ్రూ.

"ఏమి బోధపడటంలేదు ఇందులో? ఆండ్రూ; నేను ఎంత మథనపడిపోతున్నానో చూడరాదూ? నేను చెప్పున్న ప్రతిఅక్షరమూ నిజమేనని నీకు తెలుసు. సర్ పెర్సీ లండన్ బ్రిడ్జిదగ్గర డ్రీమ్ ఎక్కి కెలే బయలుదేరిఉంటారు. ఏ సాయంత్రానికో షావలిన్ డోవరు నుండి ఇంకొక నావలో కెలే చేరతాడు. తన పథకం బయటపడిపోయినదని తెలియక పెర్సీకౌంట్ మొదలయినవారిని వేచి ఉండమన్న చోటికి వస్తాడు. షావలిన్ భటులతోపోయి పట్టుకుంటాడు——"

సర్ ఆండ్రూ అప్పటికి తెగించి ఏమీ నిర్ణయానికి రాలేకపోయినాడు. మౌనంగా ఊరుకున్నాడు. మార్గరెట్ ఆవేశం ఆపుకోలేకపోయింది. "ఏమిటి సర్ ఆండ్రూ? నామీద నమ్మకం కుదరనేలేదా? భర్తకు ద్రోహం చేసేటంత నీచురాలి ననుకున్నావా నేను?"

"అలా ఎవరన్నారు? సరేగాని..."

"ఊఁ! కాని..."

"షావలిన్‌కు అదేదో రహస్యం తెలిసిపోయిందంటున్నారే! ఎలా తెలిసిందిట?"

"అబద్ధమెందుకు చెప్పాలి? ఆ రహస్యం అతనికి తెలియటానికి మూలం నేనే! ఏంచెయ్యను? నా గొంతుమీదికి కత్తితెచ్చాడు. నా సోదరుని చావు బ్రతుకులు అతని దయాధర్మాలమీద ఆధారపడిఉండే పరిస్థితి వచ్చింది. ఆ అవకాశం తీసుకొని, నాచేత బలవంతంగా ఈనీచపుపని చేయించాడు. చెప్తేనమ్మవుకాని, ఎటువంటి దారుణమైన పరిస్థితిలో నేనుచిక్కుకున్నానో తెలుసా?"

ముందుకు పోతే నుయ్యి, వెనకకు పోతే గొయ్యి అన్నట్లయింది ఆండ్రూ పని. ప్రాణాలు పోయేటప్పుడు కూడా నాయకునిపేరు బయటపెట్టనని, ఆయన ఆజ్ఞ జవదాటనని ప్రతిజ్ఞచేశాడు. దాన్నిప్రకారం మార్గరెట్ మాటలు ఆమోదించటం కాని, నాయకుని అనుమతి లేనిదే ఇప్పుడు ప్రాన్సు బయలుదేరిపోవటం కాని కూడదు. ఇటుచూస్తే మార్గరెట్ దీనంగా ప్రాధేయపడుతున్నది. అటు పింపర్నల్ కూడా నిజంగా ప్రమాదంలో చిక్కుకున్నాడు చివరకు ఎలాగో స్థిమితపడ్డాడు.

"లేడీ బ్లాకెనీ! ఇందాకటినుండి నేను పడుతున్న అవస్థ ఆ పరమాత్మునికి మాలిమి సరే. ఇప్పుడు నన్ను ఏమిచెయ్యమంటారు? మేము పందొమ్మిది మందిమి ఉన్నాము. పింపర్నల్‌కోసం ఈ పన్న సముద్రంలో దూకమంటే సిద్ధం" అన్నాడు.

"చేసేటందుకు వేరే ఏముంది? నేను వెంటనే బయలుదేరి కెలేపోవాలి. అక్కడ ఆయనను కలుసుకోవటం ఎలాగో చెప్పు. చాలు."

"మీరెందుకు. నేనే పోయివస్తాను."

"అలా కాదు సర్ ఆండ్రూ! షావలిన్‌కు నీవు పింపర్నల్ అనుచరుడివని తెలుసు. అందుచేత నీమీద ఒక కన్ను వేసి ఉంచుతాడు. నన్నయితే ఎవరూ అనుమానించరు."

"ప్రయాణం చాలా కష్టంగా ఉంటుంది. ప్రమాదంకూడాను."

"కానీ! పోయేదేముంది? ఈ ప్రయాణమే నా చావుబతుకుల సమస్య. నేను కెలే రావటానికి వీలు లేకపోతే నా ప్రాణాలు ఇప్పటికిప్పుడు, ఇక్కడికిక్కడ పోతాయి. అంతే! బయట నా కోచి ఉన్నది. నేను ఇప్పుడే బయలుదేరి డోవరు పోతున్నాను. వీలయినంత తొందరగా నీవూ వచ్చేయి! ఫిషర్‌మన్స్ రెస్ట్‌లో ఉంటాను. నీవేమీ అనుకోకుంటే ఒకమాట చెప్తాను. నీవు మారువేషంలో ఉంటే మంచిది. నీకు అభ్యంతరం లేకపోతే, నా పరిచారకుడుగా..."

"దానికేం? అదే మంచిది. అలాగే వస్తాను."

"భగవంతుని దయ ఎలా ఉన్నదో?" అంటూ మార్గరెట్ శలవుతీసుకున్నది.

మరికొన్ని క్షణాలలో మార్గరెట్ డోవరుకు బయలుదేరింది. ఇప్పటికి మార్గరెట్ మనస్సులోని చింత వదిలిపోయింది. దానిబదులు ఉత్సాహం నిండింది. సర్ ఆండ్రూ, తానూ కలిసి కెలే పోతారు. షావలిన్ ఒక ప్రక్కనుండి వ్యూహం పన్నుకుంటూ వస్తాడు. మరొక ప్రక్కనుండి తామిద్దరూ దానిని ఛేదించుకుంటూ రావాలి.

ఈ ఆలోచనలలో ఉండగా, ఎప్పుడో మార్గరెట్‌కు కలతనిద్రపట్టింది. గుఱ్ఱాలు వాయువేగంతో సాగిపోతూ కోచిని డోవరు చేర్చినాయి. (ఇంకావుంది)

# బొంబాయి సినిమా లేఖ

బొంబాయి ఫిలిం నిర్మాతలు కొత్త నిర్మాణాలకు ప్లానులు, పథకాలు వేసే నెల జూలై నెల. వర్షాలమూలంగా స్టూడియోలనే అంటిపెట్టుకుని ఉండి, గడచిన ఆరునెలల్లోనూ తాము సాధించిన విజయాలను, పొందిన అపజయాలను సింహావలోకనం చేసుకుని, ఆ అనుభవంతో రాబోయే ఆరునెలలకూ కొత్తపథకాలు వేసుకుంటారు.

ఈయేడాది మొదటి ఆరునెలల అనుభవాలనూ సమీక్షించుకుంటే ఒక సంగతి స్పష్టమవుతోంది. ఆలోచన రేకెత్తించే వాస్తవిక చిత్రాలకు భారతదేశంలో మార్కెట్ లేదు. ప్రయోజనవంతమైన వాస్తవిక కథావస్తువులతో కళాత్మకంగా నిర్మించబడిన గరమ్‌కోట్, నౌక్రీ, పరిచయ్, పెన్షనర్, సావధాన్ మొదలైన చిత్రాలు ఆర్థికంగా నష్టపోయాయి. ఎంత గుండె నిబ్బరం కలిగిన నిర్మాతకైనా ప్రజలను విజ్ఞానవంతులుగాచేసే చిత్రం తీయాలంటే వణుకు పట్టుకుంది.

చవకబారు సంగీతచిత్రాలకు గడచిన ఆరునెలల్లోనూ మంచి విజయం లభించింది. ఫిల్మిస్తాన్‌వారి "నాగిన్" చిత్రం సినిమా చరిత్రలో అద్వితీయమైన విజయం పొందింది. ఏ ప్రయోజనమూ లేని కథతో ఆ చిత్రం అంత విజయం పొందినదంటే భారతదేశంలో చవకబారు వినోదానికి ప్రజల్లోగల ఆదరణ ఎంత గొప్పదో తెలుస్తుంది. ఆజాద్, ఊరన్ ఖటోలా, మస్తానా, పహెలీ ఝలక్, ఆఖరికి పౌరాణికమైన "శివభక్త" మొదలైన చిత్రాలన్నీ బాక్సాఫీస్ విజయం పొందాయి. కారణం వాటిలో పాటలు, నృత్యాలు, అభూతకల్పనలు ఉండడమే.

ఇక్కడ మరొక సంగతికూడా చెప్పడం అవసరం. రెండేళ్ళకింద బిమల్ రాయ్ తీసిన దో బిఘా జమీన్‌తో ప్రారంభమైన వాస్తవిక చిత్రాల ఉద్యమం గడచిన కొద్ది నెలల్లో బాగా దెబ్బతిన్నది. ఈ ఉద్యమం ఆ దెబ్బనుండి ఇక కోలుకోలేకపోవచ్చును కూడా. నిర్మాత అనిపించుకునేవాడెవడూ విద్యాబోధక చిత్రాన్ని తీయడానికి ముందుకు రావడంలేదు. పెట్టుబడి డబ్బైనా తిరిగి వస్తాయని నమ్మకంలేని చిత్రనిర్మాణానికి ఎవరు సాహసిస్తాడు? కనుక ఇప్పుడందరూ పలాయనవాద చిత్రాలకు ఎగబడుతున్నారు. ప్రభుత్వమూ, వృద్ధ దేశనాయకులూ ఎంతకస్త్రైర చేసినా, ఏ నిర్మాత కూడా, తను కష్టపడి ఆర్జించిన ధనాన్ని ప్రజలకు విద్యాబోధనచేసే చిత్రాల్లో పెట్టి నష్టపోవడానికి సిద్ధంగాలేడు. ఉద్యమనాయకుడైన బిమల్ రాయ్ కూడా పాతకాలపు 'దేవదాసు' నే తీసుకుని సంగీతాత్మకంగా నిర్మిస్తున్నాడు.



జానకి గృహప్రవేశసందర్భంలో తీసిన ఫొటో.

"కన్యాదానం"లో ఒక దృశ్యం.






"సితారా" హిందీ చిత్రంలో బీగంపారా.

మద్రాసులో ఎస్. ఎస్. వాసన్‌గారు ఈమధ్య "దో దుల్హే" అపజయం పొందటంతో, ఈసారి నృత్య, సంగీతమయమైన చిత్రం తీస్తున్నారు. ఈ చిత్రం పేరు "ఇన్సానియత్". షెరిడన్ రచించిన 'పిజారో' ఆధారంగా ఈ చిత్రం తీయబడుతున్నది. ఇందులో అగ్రతారలైన దిలీప్ కుమార్, దేవ్ ఆనంద్, బీనారాయ్ ఉన్నారు. వీరుకాక, హాలీవుడ్ తారయైన 'జిప్పీ', అనే ఒక చింపంజీ కూడా ఈ చిత్రంలో పాల్గొంటున్నది. ఈ చింపంజీ ఇదివరకు ఆర్ కె ఓ వారి చిత్రాల్లో నటించింది. దీన్ని 'ఇన్సానియత్' కోసం హాలీవుడ్ నుండి తెప్పించారు.

ఎ. వి. ఎమ్. వారి "చోరీ చోరీ" కూడా అఖిల భారత ప్రదర్శనంకోసం ఉద్దేశింపబడినదే. ఇది శీఘ్రగతిని తయారవుతోంది. రాజ్ కపూర్, నర్గీస్ ఇందులో ముఖ్య పాత్రధారులు.

భాగ్యవాన్, మహాత్మవంటి ఉత్తమ వాస్తవికచిత్రాలను నిర్మించి ప్రసిద్ధుడైన దత్తా ధర్మాధికారికూడా పద్ధతిమార్చి కేవలం వినోదకర చిత్రం ఒకటి తీస్తున్నాడు. దాని పేరు 'సబ్సే బడా రుపయా'. ఇది పూనా, దక్కన్ స్టూడియోలో తయారవుతున్నది. శశికళ, హాస్యనటుడు ఆగా ముఖ్యపాత్రలు ధరిస్తున్నారు. నానాపలిస్కర్, సుందర్, కృష్ణకాంత్, మాస్టర్ అల్హాద్ కూడా నటిస్తున్నారు. మహానాయ్, సర్గం మొదలైన సంగీతచిత్రాల దర్శకుడు సంతోషీ ఈ చిత్రాన్ని డైరెక్టు చేస్తున్నారు.

బొంబాయిలో కూడా ఈమధ్య మొదలుపెట్టిన దాదాపు ప్రతిచిత్రమూ సంగీతంతో కూడిన మెలోడ్రామా చిత్రమే. శ్రీ విశ్వభారతివారు "బసంత్ బహార్" చిత్రం తీస్తున్నారు. ఇందులో భారత్ భూషణ్ ఒక గాయకుడుగా నటిస్తున్నారు. ఈ గాయకుడూ, మైసూర్ సుల్తాను టిప్పూ ఒకే సుందరిని ప్రేమిస్తారు. గాయకుని గానశక్తి టిప్పూ ఖడ్గశక్తిని జయిస్తుంది.

శి. డి. కాశ్యప్ నళిని జయవంత్‌తో 'ఆన్‌బాన్', ఫిల్మిస్తాన్‌వారు "హీర్" అనే పంజాబీ జానపదగాథాచిత్రం, గ్యాన్ ముఖర్జీ "షికాయత్" చిత్రం తీస్తున్నారు. ఇవన్నీ పుష్కలంగా సంగీతం కలిగిన ప్రేమ కథా చిత్రాలే. శాంతారాం వంటి అగ్రశ్రేణి దర్శకుడు కూడా ఇప్పుడు



భరణి ఉపనయనం: రామకృష్ణ, భరణి, భానుమతి.



“మా షాహిర్ భక్తి”లో ఉల్హాస్.

# సినిమా పరిశ్రమపై పన్నుల భారం

## సుందరలాల్ నహతా ప్రకటన

"ఆంధ్రప్రభుత్వంవారి ఖజానా లోటును భర్తీచేయడానికి తీసుకోవలసిన చర్యలనుగూర్చి కాంగ్రెసు పార్టీ ఆంధ్రప్రభుత్వానికిచ్చిన సలహాలపై" ఆంధ్ర ఫిలిం వాణిజ్యమండలి అధ్యక్షుడు సుందరలాల్ నహతాగారొక పత్రికా ప్రకటన చేశారు. వినోదంపన్ను మొదలుగాగల వివిధములైన పన్నులరూపేణా చిత్రాల రాబడులలో నూటికి 60 వంతులను సినిమా పరిశ్రమ కోల్పోతున్నదని నహతాగారు తమ ప్రకటనలో వెల్లడించారు. యుద్ధాత్పూర్వం నూటికి 12 వంతుల చొప్పున ఉండే వినోదం పన్ను క్రమేణా పెరిగి ఈరోజున నూటికి 25 వంతుల పైగా ఉన్నదనీ, సినిమా పరిశ్రమ ఇంత పన్ను కడుతున్నా దానికి పీసమైనా ప్రభుత్వసహాయం రావడం లేదని ఆయన అన్నారు. దీనివల్ల చిత్రాలకు రాబడి తగ్గిపోతోందని, చిత్రాలకూ, ప్రభుత్వానికీ కూడా రాబడిని హెచ్చించాలంటే వినోదం పన్ను బాగా తగ్గించడమే మార్గమనీ ఆయన అన్నారు. మధ్యప్రదేశ్ ప్రభుత్వం వినోదం పన్నును నూటికి 12½ వంతులకు తగ్గించడాన్ని ఆయన మంచి ఉదాహరణంగా పేర్కొన్నారు.

"సినిమాపరిశ్రమ, ముఖ్యంగా ఆంధ్రదేశంలో వినోదంపన్ను, ప్రదర్శన పన్ను వలన అభివృద్ధి పొందలేకుండా ఉన్నది. పన్నులభారం బాగా తగ్గించబడితే తప్ప చిత్రాలకు రాబడి పెరగదు. పన్నులు తగ్గించకపోతే పరిశ్రమ నాశనమైపోయే ప్రమాదం ఉన్నది. రాబడి తగ్గుతున్నదని



శ్రీ సుందరలాల్ నహతా.

# బొంబాయి సినిమా లేఖ

నృత్య సంగీత చిత్రం "ఝణక్ ఝణక్ పాయల్ బాజే" తీయవలసి వచ్చింది. ఇతర దర్శకు లందరికంటె ఎక్కువగా శాంతారాం సంఘ సంస్కరణకు పనికివచ్చే చిత్రాలు ఎక్కువగా నిర్మించాడు. ■ విషయమై పట్టుదలగూడా కలవాడు. అటువంటివాడే తన పట్టుదల విడనాడవలసి వచ్చింది. ఆయన నిర్మించిన పై చిత్రం టెక్నికలర్ చిత్రం. దీనికి ప్రింట్లు తీయించడంకోసం ఆయన లండన్ వెళ్ళాడు. ఆ చిత్రం ఆగస్టు 15 వ స్వాతంత్ర్యోత్సవంనాడు దేశమంతటా విడుదల అవుతుంది.

సంతోషీ నిర్మిస్తున్న "శిల్లీకా ఖగ్"లో రాజ్ కపూర్, నర్గీస్, "గర్మాగరమ్"లో నాదిరా నటిస్తున్నారు. ఈ చిత్రాలు కేవలం పామరజనానికి వినోదం ఇవ్వడానికి ఉద్దేశించబడిన సంగీత చిత్రాలు. ఆనంద్ ఫిల్మ్స్ వారి "ఇంతికం" (అశోక్ కుమార్), సైగల్ బ్రదర్స్ వారి "లోకేపతి" (కిశోర్ కుమార్, శశికళ, స్మృతిబిశ్వాస్, గాధా కిరన్) చిత్రాలు కూడా సంగీతం, హాస్యం కలిగిన చిత్రాలే.

* * *

జూన్ 10 వ తేదీన 500 మంది జూనియర్ నటీనటులు సమ్మెచేశారు. సకాలంలో జీతాలివ్వాలనీ, తమ సంఘాన్ని పరిగణించాలనీ, ఎక్కువ జీతాలివ్వాలనీ, స్టూడియో ఉద్యోగులను తమ సంఘంద్వారా నియమించాలనీ వీరు ఒత్తిడిచేస్తున్నారు. వీరితో మేకప్ పనివారు, దుస్తులతయారీ పనివారు, ఎక్స్‌ట్రాల సప్లయిదారులు కూడా చేతులు కలిపారు. తమ కోర్కెలను ప్రజలకు తెలియజేయడానికి బొంబాయి ఉత్తర, మధ్య ప్రాంతాలలో వీరు ఊరేగింపు జరిపారు.

వ్యాపారపు పన్ను అధికారులు ఇటీవల సేకరించిన వివరాలు స్పష్టపరుస్తున్నవి. కనుక పన్ను పద్ధతిని సంస్కరించి, ఇప్పటిపన్నుల రేట్లను తగ్గించవలసిన అవసరాన్ని ఆంధ్ర ప్రభుత్వం గుర్తించాలి. ఇది ప్రభుత్వానికి, పరిశ్రమకూ కూడా లాభదాయకం," అని వహాలొగారన్నారు.

## జెమినీ చిత్రంలో చింపంజీ తార

జెమినీవారి హిందీ చిత్రం "ఇన్సానియత్"లో నటించడానికి అమెరికానుండి చింపంజీ ఒకటి ఈ నెల 20 వ తేదీన మద్రాసు వచ్చింది. దానిపేరు జిప్పీ. దాన్ని తర్ఫీదుచేసే మనిషి క్వెస్లాస్ కూడా వెంటవచ్చాడు.

బొంబాయి, శాంటాక్రజ్ విమానాశ్రయంలో ఈ చింపంజీ విమానం దిగగానే దానికి ఘనమైన స్వాగతం ఇవ్వబడింది. హిందీ నటి మోహనా దానికి పూలదండ వేసింది. మనిషివలెనే సూటూ బూటూ ధరించి, అది అందరితోనూ కరచాలనం చేసింది. అందరితో కలిసి కుర్చీమీద కూర్చుని టీ త్రాగింది. తొణకూ, బెణుకూ లేకుండా పెద్దమనిషివలె హాపీగా వ్యవహరించింది. వారానికి మూడుసార్లు ఇది టెలివిజన్ కార్యక్రమాల్లో పాల్గొంటుందట. ఈమధ్య ఒక టార్జాన్ చిత్రంలో కూడా నటించి హాలీవుడ్ తార అనిపించుకున్నది. నెలకి లక్షరూపాయలదాకా సంపాదిస్తుంది. దీని వయస్సు నాలుగేళ్లు. ఎత్తు 8½ అడుగులు. బరువు 45 పౌనులు. శుద్ధ శాకాహారి. ఈ దేశంలో ఇది రెండు నెలలపాటు ఉంటుందట. మద్రాసులో ఇది జెమినీ అతిథి భవనంలో మకాం చేస్తున్నది.

## సైగల్‌ను పోలిన నటుడు

ధార్వార్‌కు చెందిన మోగేరీ అనే ముస్లిం నటుణ్ణి సైగల్ చిత్రంలో సైగల్‌గా నటించేందుకు న్యూ థియేటర్స్‌వారు నియమించారు. మోగేరీకి సైగల్ పోలికలు బాగా ఉన్నాయి. సైగల్ చిత్రాల్లోంచి తీసిన దృశ్యాలను కలపడానికి మధ్యమధ్య కావలసిన దృశ్యాల్లో ఇతడు సైగల్ పాత్రను ధరిస్తాడు. ఈచిత్రంలో కన్నన్‌బాల, జమున మొదలైన పలువురు పాత నటీనటులుకూడా పాల్గొంటున్నారు. ఈ చిత్రంలో సైగల్ పాటలు 18 వరకూ ఉంటాయట. ఈ చిత్రాన్ని నితిన్‌బోస్ డైరెక్టుచేస్తున్నాడు. ఫోటోగ్రాఫర్ కూడా ఆయనే. ఇప్పటికి రెండు రీళ్లు తయారైనవట. ఆగస్టు నెలాఖరుకు చిత్రం సిద్ధమవుతుందట.

### అరబ్బీలో ఆజాద్

పక్షిరాజావారి "ఆజాద్" హిందీ చిత్రాన్ని అరబ్బీ భాషలోకి అనువదించి మధ్యప్రాచ్య దేశాల్లో విడుదల చేస్తారట. డబింగ్ కోసం శ్రీరాములు నాయుడుగారు కైరో ప్రయాణమయ్యారు.

### బుద్ధుని జీవితచిత్రం

భారతదేశంలోని బౌద్ధ శిల్పాలను, కుడ్య చిత్రాలను ఆధారంచేసుకుని బుద్ధుని జీవితాన్ని చిత్రీకరించడానికి బిమల్‌రాయ్ సంకల్పించారు. భారత ప్రభుత్వం తరఫున ఆయన ఈ చిత్రం తీస్తారు.

నెహ్రూ రచించిన "డిస్కవరీ ఆఫ్ ఇండియా" గ్రంథాన్ని కూడా చిత్రీకరించడానికి ప్రధాని అనుమతితో బిమల్‌రాయ్ సంకల్పించారు. ★



వేసంగి నృత్యపాఠశాల విద్యార్థి బృందం. మధ్య కూర్చున్నవారు డైరెక్టర్లు శ్రీ రమణారావు, శ్రీమతి సామ్రాజ్యం.



# ప్రేక్షకుల అభిప్రాయాలు

ప్రకాష్ ప్రొడక్షన్ "అంతేకావాలి" ...ం చాల బాగున్నది. శ్రీరాం చాల ...గ నటించాడు. జగ్గయ్య ఈచిత్రంలో ...పోకడలతో నటించాడు. జి. వరలక్ష్మి ...మెచ్చుకోతగ్గట్టు ఉంది. రమణారెడ్డి ...శ్యం సున్నితంగా ఉన్నది. పాటలు ...లా బాగావున్నాయి.

వాకాడ అప్పారావు,
—కాకినాడ.

*　*　*

హాస్యమే ప్రధానముగా గల ఈ చిత్ర ...నకు జగ్గయ్య, జి. వరలక్ష్మిగారలు ...ప్రాణముపోశారు. చిత్రమున నాయక ...పాత్రను శ్రీరాం చక్కగా నిర్వహించి ...నాడు. మిగిలిన నటీనటులందరూ వారివారి పాత్రలకు న్యాయం చేకూర్చారు. పెండ్యాల సంగీతము బాగున్నది.

జి. ఎల్. మూర్తి,
—అమలాపురం.

*　*　*

...రుద్ర, ఆత్రేయగార లీచిత్రానికి జీవం ...రు. ప్రకాశరావుగారి దర్శకత్వంలో ...త ఏమీ లేదు. పెండ్యాలవారి సంగీతం ...త్రానికి వన్నె తెచ్చింది. దీనికి తార్కాణం ...రాతన సంగీత సాహిత్యాన్ని జ్ఞప్తికితెచ్చే ...రాజాధి రాజులు' వంటి పాటను చిత్రంలో ...ప్రవేశపెట్టడమే. మిగిలిన పాటలలోకల్లా ...ర్గ పాడిన 'వెడలిపోయె ప్రేమికా' పాట ...లా బాగుంది.

నటులలో శివరామకృష్ణయ్య, సి. యస్. ఆర్, జగ్గయ్యగారలు చాలా ...క్కగా నటించారు. దుర్గగా వరలక్ష్మి ...టన అంత చెప్పుకోదగ్గదిగా లేదు. మల్లిక్ ...పాత్రగా మల్లిక్ సమర్థతతో నిర్వహించ లేకపోయాడు. శారద పాత్రను మాలతి ...దులు ఇంకెవరికైనా బుక్ చేస్తే బాగుం ...డేది. శ్రీరాంకు నటన అంటే ఏమిటో ...నాడా అర్థంకావటంలేదని మరొకసారి ఋజువు చేసుకున్నాడు. ఇక రమణారెడ్డి ...పాత్ర కేవలం అనవసరం. చిత్రంలో ...త్యాలన్నిటిలోను జీవమున్నది నశించి ...పోయి చాలా అసభ్యంగా గోచరించాయి. ...ఈ చిత్రానికి 'అంతే కావాలి' అన్న పేరు ...న్నా 'అంతా నాటకమే' అన్న పేరు ...పెడితే చాలా బాగుండేది.

...దర్శకత్వంలో కూడా అచ్చటచ్చట చిన్న చిన్న లోపాలు లేకపోలేదు. ఉదా: వారం రోజులనుండి తన బంగళాలో ఎవరో క్రొత్త వ్యక్తి నివాసముంటున్న సంగతి జమీందారుకి తెలియకపోవటం! దుర్గ 'వెడలిపోయె ప్రేమికా' పాట పాడుతూ నడుస్తున్నపుడు నాలుగయిదుసార్లు కారు సమీపంనుండి దాటిపోవడం జరుగుతుంది. నిజానికి ఈ సన్నివేశం వాస్తవికతకి చాలా దూరం. పాట అయిపోయిన వెంటనే ఇంక నా పని పూర్తయిందన్నట్లు దుర్గ తటాలున వెనుదిరిగి వెళ్ళిపోతుంది. ఈ సన్నివేశం కూడా దర్శకత్వంలోని లోపాన్ని సూచిస్తుంది.

సొంతానికి చిత్రం అన్నివిధాలా (అక్ష...కంగా కూడా) బాగానే రాణించవచ్చు.

యు. వి. సత్యనారాయణ,
—విశాఖపట్నం.

*　*　*

నిడివి కొంచెము తక్కువగా వుండవని చిత్రము రాణించవచ్చని తలచాము. కాని ఇంటర్వల్ వరకు చాలా విసుగనిపిస్తుంది. ఇంటర్వల్ తరువాత చిత్రము కొంచెము బాగుంది. కాని చిత్రాన్ని సుఖాంతము చేయటానికి చాలా గాభరాచేశారు. ప్రేక్షకులకికూడా అయోమయంగా వుంటుంది. చిత్రములో చాలా తప్పులు కనిపిస్తాయి. జమిందారుకూతురు తన ప్రియుణ్ణి రివాల్వరుతో చంపటానికిసిద్ధపడి, దెబ్బ చూచిన



"జగద్గురు శంకరాచార్య"లో అద్వైత ప్రవక్త శంకరుడుగా అభిభట్టాచార్య.

పారమౌంట్ వారి "కంట్రీ గర్ల్"లో. గ్రేస్ కెలీ, బింగ్ క్రాస్బీ, విలియం హోల్డెన్.



హాలీవుడ్ తార గ్రేస్ కెలీ
('కంట్రీ గర్ల్'లో)

## ప్రేక్షకుల అభిప్రాయాలు

వెంటనే అంతగా మనస్సు చలించి కట్టు కట్టడము బాగా లేదు. రాజానగరం జమిందారుయింటికి జగ్గయ్య పెళ్లికొడుకు అనే మారు వేషములో వచ్చినపుడు మాటలు గాని, నటన గాని బాగా లేవు. పాటలు గాని, ఎవరి నటన గాని బాగా లేవు. మొత్తముమీద చిత్రము రాణించలేదనే చెప్పాలి.

నంబూరి రామకృష్ణ,
—విజయనగరం.

Printed and Published for
Nageswara Rao Estates Ltd., by
S. Radha Krishna at The
Andhra Patrika Press,
&7, Thambu Chetty St., Madras-1
Editor: :. Sambhu Prasad.



తెరచాప లెత్తుకుని పడవలకు ప్రక్కనే
పరుగెత్తు పడవలూ, పరుగెత్తునీడలూ!

ఫొటో: వి. రామమూర్తి—మద్రాసు.







# లై ఫ్ బా య్
# స బ్బు

ప్రతిదిన మలినములోని క్రిముల
నుండి మిమ్ములను కాపాడును







ఇండియాలో తయారుచేయబడినది

L. 251-X52 TL